## స్మృత్యంజలి



పితృదేవోభవ !

మా నాన్నగారు పూజ్యులు

శ్రీ కొమరగిరి నరసింహారావుగారు

నందిగామలో స్వర్గస్థులైనారు వారి ఆత్మశాంతికి భగవంతుడ్ని ప్రార్థించుచున్నాము.

వారికి మా శ్రద్ధాంజలి సమర్పించుకుంటున్నాము.

జననం : 15-10-1902 మరణం : 12-6-1986

కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ 'శ్రీవాణి'

,, రామమోహనరావు

,, సూర్యప్రకాశరావు

,, రాజశేఖర్

# అభిప్రాయవేదిక

" మీ పత్రికలో ఆధ్యాత్మిక విషయాలు చాలా బాగున్నాయి. సంపాదకీయాలు అద్భుతంగా ఉన్నాయి. "

– వేమూరి నారాయణమూర్తి, బందరు

" జాతిని ముఖ్యంగా తెలుగుప్రజలను శీలవంతులుగా, దేశభక్తులుగా శ్రీవాణి పత్రిక తీర్చిదిద్దగలదు అనుటకు ఎలాంటి సందేహము లేదు. "

– గులాజీల మల్లారెడ్డి (అడ్వకేటు), కరీంనగర్

" శ్రీవాణి అన్ని విధములా ఆకర్షణీయంగా ఉంది. మా కుటుంబ సభ్యులందరూ మక్కువతో చదువుతున్నారు. "

– గుండవరపు సత్యనారాయణ, భువనగిరి

" శ్రీవాణి అందర్ని ఆకర్షిస్తున్నది. సరిక్రొత్త శీర్షికలతో వెలువరుస్తున్నందుకు సంతోషం. "

– డా॥ జి. జోతిర్మయిరాధ, అనంతపూర్

" పత్రికను ఉత్తమ సాంప్రదాయాలతో వెలువరిస్తున్నందుకు అభినందనలు. "

– జావమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప

" శ్రీవాణి వ్యాసాలన్నీ బాగుంటున్నాయి. ఆకర్షణీయమైన ముఖచిత్రాలు వేస్తున్నారు. "

– కె. వి. సాంబశివరావు, దావణగెరె, కర్ణాటక

" శ్రీవాణిని చూచిన తరువాత మిమ్ములను అభినందించకుండా ఉండలేకపోతున్నాను. పత్రిక నిండుగావుంది. రంజనిమాల హైలైట్. "

– డా॥ ఇ. చంద్రమౌళి, తిరుపతి

" శ్రీవాణి పత్రికలు రెగ్యులర్‌గా చదువుతున్నాను. వార్షికోత్సవ విశేషాలు కన్నులకు కట్టినట్లుగా వివరించారు. జస్టిస్ సాంబశివరావుగారి ఉపన్యాసం చదివాక శ్రీవాణి నిర్వాహకులుగా మీ నిర్మాణాత్మక దృష్టిని గ్రహించగలిగాము. శ్రీవాణి అనే పేరులోనే ఉన్నది వైశిష్ట్యం. శ్రీవాణికి అభినందనలు. "

– స్వరూపరాణి, మోద

జూన్ - 1986

సంపుటి : 2

సంచిక : 6


# శ్రీవాణి


సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు


## విషయసూచిక




మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM




శ్లో॥ అజ్ఞానం త్యజ హేమనోఽపిచ సదా బ్రహ్మాత్మ సద్భావనాత్
సంకల్పానఖిలానపి త్యజ జగన్మిథ్యాత్వ సద్భావనాత్
కామాన్ సాధన సాధ్యదుఃఖ నివహవ్యానా దజస్రం త్యజ
క్రోధం తుక్షమయా సదా జహి బలా ల్లోభంతు సంతోషతః ॥

ఆచార్య శంకరులు లోకాన్ని అనుగ్రహించి మనసు కంటుకొనే దుర్వాసనలను దూరం చేసుకోటానికి మార్గాన్ని ప్రబోధిస్తున్నారు.

మనిషిని నడిపించేది మనస్సు. దాన్నిబట్టే మనిషి ప్రవృత్తి వుంటుంది. కనుకనే అన్నింటికంటే ముందు మనసును బాగుచేసుకోవాలి.

మనసుకు మాలిన్యం పట్టింది. అదే అజ్ఞానం. అంటే నేను వేరు, బ్రహ్మతత్త్వం వేరు అనే భావనే అజ్ఞానం. గీతార్థంగాని, ఉపనిషదర్థంగాని, బ్రహ్మసూత్రార్థంగాని యేమిటంటే నేనే బ్రహ్మని. ఈ ఆత్మే బ్రహ్మ అనే యథార్థ విషయం. ఈ సంగతి తెలుసుకోలేని స్థితి అజ్ఞానం. ఈ అజ్ఞానం వల్ల మనిషి స్వస్వరూపం తెలిసికోలేకపోతున్నాడు. అనగా ఆత్మజ్ఞానం అతనికి లేకపోతోంది. పైగా యీ శరీరమే ఆత్మ అనుకొనే ప్రమాదంలో కూడా పడుతున్నాడు. మనిషిలో నేను అనే విశ్వాసంతో గూఢిన యే భావమున్నదో లేక తెలివి వున్నదో అదే ఆత్మ పదార్థం. అయాత్మే బ్రహ్మం. "అహంబ్రహ్మాస్మి" "అయమాత్మాబ్రహ్మ" "తత్త్వమసి" "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే మహావాక్యాలు తానే బ్రహ్మం అని ప్రబోధిస్తున్నాయి. ఇది తెలియని మనిషి తాను బ్రహ్మంకంటే వేరు అనే భావంలో వున్నాడు. ఈ రూపమైన అజ్ఞానం నశించి తానే బ్రహ్మం అని తెల్సుకోవాలంటే గురువు నాశ్రయించి తీరాలి అలా గుర్వనుగ్రహంతో ఓ మనసా! అజ్ఞానం వదిలిపెట్టు అని మనసును సంబోధిస్తున్నారు స్వామి.

ఇక యీ మనసులో అనుక్షణం పుడుతూంటాయి కోరికలు. వాటి కంతంటూ లేదు. దీనికి కారణం యీ కంటి కగపడే జగత్తు. ఈ ప్రపంచం, ఇందులోని వస్తుజాలం సర్వం నిజమనుకొని మోహపడి మనిషి వీటిమీద కోరికలు పెంచుకొంటున్నాడు. ఈ కోరికలు పోవాలంటే ముఖ్యంగా ఈ జగత్తంతా అసత్యం అశాశ్వతం అనే విషయం తెలుసుకొంటే చాలు. ఈ జగత్తు పుట్టింది. అంటే పుట్టుకకు పూర్వం లేదు. పుట్టింది నశించక తప్పదు. నశించిన తర్వాత యిది వుండదు. పుట్టుకకు నాశనానికీ నడుమ వచ్చిందే యీ జగత్తు. ఇది నిజం కాదు. ఈ సత్యాన్ని తెలుసుకొంటే మనిషి కోరికలను పెంచుకోడు. కనుక ఓ మనస్సా! ఈ జగత్తు వట్టి అబద్ధం అని తెలుసుకొని ఆ కోరికలను పూర్తిగా వదిలేయి అని ప్రబోధిస్తున్నారు శంకరులు.

"కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః" అని గీతా వాక్యం. ఈ కామక్రోధాలు రెండూ రజోగుణం వల్ల పుడతాయి. ఈ కామం అనుభవిస్తున్నకొద్దీ నశింపక పోగా పెరుగుతుంది. దీన్ని సాధించటానికి మనిషిపడే శ్రమ యింతా అంతా కాదు ఆ శ్రమవల్ల వచ్చే దుఃఖాలను తల్చుకొని యీ కామం జోలికి పోవద్దని శంకరుల ప్రబోధం.

క్రోధం కూడా పెద్ద శత్రువే మనిషికి. కోపంవల్ల పాపకర్మ చేసాడు మనిషి. కోపమనేది అనర్థాలన్నింటికి మూలం. ఈ అనర్థాలతో జీవితం నరకం చేసుకోకుండా వుండటానికొక వుపాయం వుంది. అదే క్షమ. అంటే ఓర్పు. ఎలాంటి కష్టాన్నయినా సహించే శక్తి నలవరచుకోవాలి. అప్పుడు ఎదుటివాడు కోపం గలిగించే మాట పలికినా, దూషించినా యీ సహనమున్న వ్యక్తిమీద ప్రభావమేమాత్రం పడదు. అందుకని క్షమాగుణంతో క్రోధాన్ని పోగొట్టుకోవచ్చు.

ఇలాగే లోభం కూడా అరిషడ్వర్గంలో ఒకటి. లోభిగా మనిషి జీవించటం చావులాంటిదే. అంతులేని ఆశాపాశంలో మనిషిని బంధించేది యీ లోభ గుణం. దీనిలో చిక్కిన జీవికి మోక్షం లేదు. ఈ లోభం మనిషి దగ్గరకు రాకుండా చేసుకోవాలంటే ప్రధానంగా ఎప్పుడూ తృప్తితో బ్రతకాలి. నిత్యతృప్తిగల వ్యక్తికి లోపమనేది సంభవించదు. అదే మనిషికి కొండంత బలాన్నిస్తుంది. "సంతోషమే సగం బలం" అన్నారు. సంతోషంవల్ల లోభాన్ని నశింపజేసుకో. అంటారు జగద్గురువులు. కామ క్రోధ లోభాలు మూడూ నశిస్తేగాని జ్ఞానానికి అవకాశం కలగదు ఈ మూడూ ఒక కూటమి.*

# సంపాదకీయం డా॥ కె. యల్. రావ్

నదీజలాల విషయంలో పరిపూర్ణంగా అధ్యయనం చేసిన మహామేధావి, అసమాన ప్రతిభా సంపన్నుడు, విశ్వ విఖ్యాతిని గడించిన సుప్రసిద్ధ ఇంజనీర్, కేంద్ర మాజీమంత్రి డా॥ కె. యల్. రావ్ ది 18-5-1986న భాగ్యనగరంలో స్వర్గస్తులైనారు. ఆయన వస్తుతః రాజకీయవాది కాదు. కుతంత్ర రాజకీయాలు అసలే తెలియవు. గ్రూపు ముఠా రాజకీయాలకు అతీతుడు. రాజకీయ దృష్టితో ఆయన ఏనాడు ఏ విషయాన్ని చూడలేదు. ప్రగతి పథకాలను ఎవరూ సూచించినా స్వీకరించి రూపకల్పన చేసి ప్రజలకందించిన స్వార్థరహితుడు. అయితే ఆయన సద్గుణాలు, విశాల హృదయం ఆయన జీవితప్రగతికే అవరోధమై, ప్రతిబంధకమై ఆయన ప్రతిభను మరుగున పడేశాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఏర్పడిన ప్రథమ మంత్రివర్గంలో, రాజకీయాల కతీతంగా అనేకమంది మేధావులకు స్థానం లభించింది. రానురాను ఆసత్సాంప్రదాయానికి తిలోదకాలు యివ్వడం జరుగుతున్నది. ప్రస్తుతం అటు కేంద్రంలోను, ఇటు రాష్ట్రాలలోను గ్రూపుముఠా కులరాజకీయాలు చోటు చేసుకుంటున్నాయి. మేధస్సును పరిగణనలోకి తీసుకోవడంలేదు. సంకుచిత, స్వార్థరాజకీయాలు విచ్చలవిడిగా విశృంఖలంగా విలయతాండవం చేస్తున్నాయి. ఎవరు అధికారంలోనికి వస్తే వారి అనుయాయులకు, బంధువులకు మాత్రమే అధికారయోగం పడుతున్నది.

" మేధావిగా పుట్టటంకంటే అదృష్టవంతుడిగా పుట్టడం మేలు " అనే సామెత డా॥ రావుగారి విషయంలో ఋజువైంది. ప్రస్తుత రాజకీయశాస్త్రంలో అదృష్టమునకు నిర్వచనం - కేవలం పార్టీ, కులం, గ్రూపు అని చెప్పుకుంటే సరిపోతుంది. ఈ నిర్వచనం ఆయనకు వర్తించకపోవడం వలన మహామేధావి అయినా ఇంట్లో కూర్చోవలసివచ్చింది. ముఖ్యంగా ఆయన విజయవాడ నియోజకవర్గమునకు, కృష్ణా, గుంటూరు ప్రకాశం, నల్లగొండ, ఖమ్మం జిల్లాల మెట్ట ప్రాంత ప్రజలకు ఆయన నిజంగా ' అన్నదాతే ' అటువంటి అన్నదాతను ఓడించిన ఘనతకూడా విజయవాడ లోకసభ ప్రజలకే దక్కింది. " బచవత్ ట్రిబ్యునల్ తీర్పు " మీద ఆయన ఏనాడో తన అభిప్రాయాలను వెలిబుచ్చాడు. " ఈ తీర్పు అమలుపరుస్తే కొంతకాలం తరువాత ఆంధ్రకు, రాజస్థాన్‌కు ఏ మాత్రం తేడా ఉండదు. అంతేకాదు ప్రపంచంలోని ఏ దేశంలోను యిప్పటివరకు ఈ తీర్పులాంటి తీర్పు ఎక్కడా, ఎవ్వరూ యిచ్చి ఉండలేదు." అని వారు చెప్పారు. వారి భావాలను వివరిస్తూ నేను వ్రాసిన వ్యాసమును ది 17-9-1974 ఆంధ్రప్రభ దినపత్రిక ప్రచురించింది. మరల సెప్టెంబరు 1985 'శ్రీవాణి'లో సమగ్ర వ్యాసం వ్రాశాను. ఈ విషయాలను గురించి ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వంగాని, ఈనాటి తెలుగుదేశం ప్రభుత్వంగాని ఏ మాత్రం పట్టించుకోకపోవడంవలన "తెలుగుగంగ"కు ఈనాడు ఈ దుస్థితి దాపురించింది. " గార్లాండ్ స్కీమ్ " నదీ జలమాలిక (గంగా టు కావేరి) ఆయన మేధస్సులో మెరిసి రూపొందించబడిన ఒక మహా పథకం. నాగార్జునసాగర్, హీరాకుడ్, కోసీ, చంబల్, ఫరక్కా, శ్రీశైలం, ఇబ్రహీంపట్నం, రాజస్థాన్ కాలువలు ఆయన రూపకల్పన చేసినవే. " రీ ఇన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్ " అన్న పేరుతో వారు వ్రాసిన గ్రంథం ప్రపంచ ఇంజనీరింగ్ కళాశాలలకు పాఠ్యపుస్తకమై, అతి విలువైన ప్రామాణిక గ్రంథంగా వెలుగొందుతున్నది. ఆయన రాజకీయవాది కాకపోవడంవలననూ, మందీ మార్బలంలేని నిరాడంబరుడు కావటంవలననూ, గ్రూపుముఠా కులరాజకీయాలకు అతీతుడు కావడంవలననూ - వారి మేధాశక్తిని, శక్తిసామర్థ్యాలను ఈనాటి ప్రభుత్వాలు గుర్తించలేకపోయినాయేమో ! ఈ దుష్ట సంకుచిత కుల ముఠా రాజకీయాలవలన ఒక మహా మేధావిని ఉపయోగించుకోవలసినంత స్థితిలో ఉపయోగించుకోలేకపోయినామనేది మాత్రం యదార్థం. ఇది నిజంగా దురదృష్టకరం. "బిడ్డ చచ్చిన తరువాత పాడి బయట పడుతుంది " అన్నట్లుగా ఆయన పోయిన తరువాత మంత్రివర్యులు కన్నీరు గార్చారు. అది మొసలి కన్నీరో ! లేక అది అసలు కన్నీరో ! ప్రజలే గ్రహించాలి. ఆ ధన్యజీవికి మా శ్రద్ధాంజలి. శోక సముద్రంలో మునిగివున్న వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

కొమురిశ కృష్ణమోహనరావు

# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

ఈ రంజనిమాలలోని మాటలన్నీ గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" నాటకము నుండి తీయబడినవి. ఈ దిగువ నీయబడిన ఆధారములతో రంజనిమాలను పూరించండి.

* ఆ ధా ర ము లు *



అడ్డం

1. "పొగ చెట్టై జన్మించెను........" (7, 4, 3)
4. "నీ — యేడిసినట్టే ఉంది" (4)
5. "అ — ఉన్నాడూ మంచం కింద. కుక్కా పైకి రా" (5)
7. "చుక్కల వలె — నీదు శక్తి" (4, 5)
10. "మా వకీలు — చదివేశాడండి" (4)
11. "నాకు డబ్బు — " (5)
14. "వీడు అవ్యక్తుడైతే పాపము ఆ బుచ్చమ్మ బతుకు — " (4)
15. " — అంటే మీదీ, నాదే" (3)
16. "మొన్న — దాకా" (3)
18. స్వయం తీర్ణః పరాం — " (4)
20. "వెట్టిప్పా! మంచం కిందకి రా. వెట్టి — " (7)
21. "అందుచేత — పెట్టుకోనివ్వను" (3, 2)
22. "మీకు తెలియడంకోసం గ్రంథం — చేస్తున్నాను" (2, 3)

నిలువు

1. " — నన్నట్లు సానివాళ్ళని పెళ్ళికి పిలవకపోవడం" (6, 7)
2. "జారు బురదా — ఉన్న తోవ ఎలా ఉంటుందో" (2, 4)
3. "మనదేశములో ఒక — ఉన్నది" (5)
5. " — పాతివ్రత్యం అన్నమాట ఈనాటికి విన్నాను" (6)
6. మొదటి అక్షరం ఇంగ్లీషులా చదివితే 'కన్యాశుల్కం' ఆఖరి డైలాగ్ (3, 2, 3, 4)
8. " — వాళ్ళ దగ్గర లంచం పుచ్చుకొని పస్తె కట్టలేదని సాక్షం చెప్పాడు" (5)
9. "అందుకా నన్ను ముందుకు తోసి తాను — దాగున్నాడు" (4)
12. " — ఆయన సహజగుణమా!" (5)
13. " — ఆడదయినా కనపడుతుందా గురూ!" (2, 5)
17. " — స్నానం చేసి వేగిరం రా" (5)
19. "యీ — చిక్కులకు జాకాల్, తెలివికి బిగ్ యాస్" (5)
20. " —! —! వొద్దు! నీ మనసు కనుక్కొందామని అన్నమాట" (2, 2)

మే నెల రంజనిమాల సమాధానాలు 52వ పేజీలో

# భారతీయ సంస్కృతి - స్త్రీలు

## స్త్రీలు

భారతీయ సంస్కృతిలో పవిత్రస్థానము స్త్రీలకే ఉన్నది. స్త్రీలయందు ఏడు విధములైన శక్తులున్నట్లు భగవద్గీత చెప్పుతుంది. అట్టి శక్తివంతులైన స్త్రీలు తమ శక్తిని అతిజాగ్రత్తగా వినియోగపరచుకోవాలి. ఆంగ్ల విద్య రాక పూర్వం భారతీయ వనితలు పవిత్రమైన సంస్కృతిని పోషించుకొనే విధానములందే కాలమును అంకితము గావించేవారు. ఈనాడు ఆంగ్లవిద్య అభివృద్ధితో వచ్చిన ఆడంబర జీవితం కారణంగా, అర్థరహిత ప్రవర్తనలతో జీవితాన్ని గడపడానికి ప్రయత్నిస్తున్నారు. మగవారు తమ సంస్కృతిని మరచినప్పటికీ అంత ప్రమాదముండదుగాని స్త్రీలు మాత్రం తమ సంస్కృతిని ఎంతమాత్రం మరువరాదు. ఇంటియందు పూజలు పునస్కారములు, గృహ పరిశుద్ధత, ఆహార విహారముల యందు తగు నేర్పరితనము ద్వారా పర్వదినములు, పండుగల విశిష్టతను నాటినుండి నేటివరకు నిలబెట్టినవారు స్త్రీలే. కాని దురదృష్టవశాత్తు ఆంగ్ల విద్య అభివృద్ధి చెందటం చేత నేటి బాలికలకు వంట ఇల్లంటే ఏమిటో తెలియకుండా పోయింది. పూజాగదిలోని సుగంధం వారికి గిట్టదు. గృహ పారిశుధ్యమంటే ఏమిటో వారికి అర్థమే కాదు. అలాంటివారు భారతీయ సంస్కృతి ఏమిటో ఏ విధంగా అర్థం చేసుకోగలరు? గృహ సంబంధమైన పనులు చేస్తే చేతులు మట్టి అవుతాయేమో, బట్టలు చెడిపోతాయేమో అనే భీతి వీరిలో పెరుగుతున్నది. గృహకృత్యములయందు తల్లికి ఏమాత్రము సహాయకారులుగా నిలవటంలేదు. తెల్లవార లేచినది మొదలు వీరు డ్రస్సును చక్కజేసుకోవడంతోనే కాలమును వ్యర్థం చేస్తున్నారు. ఇంతేగాక వికారమైన చర్యలలో కూడా వీరు పాల్గొంటున్నారు. మన భారతీయ సంస్కృతియందు కురులు చాలా పవిత్రమైనవి, చాలా శక్తి సంపన్నమైనవి. స్త్రీల వెంట్రుకలందు మహాశక్తి ఇమిడి ఉన్నది. కళ్యాణమైన తరువాత సుమంగళులుగా ఉండవలసిన స్త్రీలు అమంగళులుగా తయారవుతున్నారు. వెంట్రుకలను కత్తిరించుకుంటున్నారు. భర్త లేనివారు చేయవలసిన పని యిది. ఇది భారతీయ సంస్కృతికి అమంగళాన్ని చేకూర్చేది. ఇట్టి విద్యార్థినుల ముఖం చూడటం కూడా పాపమే. మన విద్యార్థినులు మాత్రం ఆ విధమైన దుర్మార్గంలో ప్రవేశించరాదు. ఇవి ఈనాటి విద్యల అవలక్షణాలు. ఈ విధమైన సుసంస్కృతిని పెంచుకొని, సమాజంలో ప్రవేశించి ఇతరులకు ఆదర్శవంతమైన జీవితాన్ని అందించాలి విద్యార్థినులు.

శ్రీ సత్యసాయిబాబా

## సంస్కృతి

భారతీయ సంస్కృతి ఏనాటికీ మారేది కాదు. ఇది కాలగమనముతో మారక, చరిత్ర గతితో మాయక, ప్రళయం వచ్చిన తరుగక, సృష్టితో పెరుగక నిరంతరం శాశ్వతమైన స్థితియందే ఉంటుంది. ఇట్టి భారతీయ సంస్కృతి అంతర్భావమే సనాతన ధర్మము. ఇట్టి సనాతన ధర్మమే జగత్తుకంతా ప్రాణసమానము. యుగములు మారినా, జగములు కదలినా మారేది కాదిది. ఇది దేశకాలపాత్రలకు అతీతమైన స్థితిలో ఉంటుంది. ఒక్క భారతీయులకు మాత్రమే కాదు, యావత్ విశ్వానికీ దీనికీ సంబంధమున్నది. ప్రకృతి సౌందర్యమును, మానవత్వ విశిష్టతను చాటే దినములే భారతీయుల పర్వదినములు. ఈనాడు పవిత్రమైన సంక్రాంతి. క్రాంతి అనగా మార్పు చెందటం. అనగా సూర్యుడు ఒక రేఖనుండి మరొక రేఖకు ప్రవేశించడం. సూర్యుడు ఒక్కొక్క నెలకు

ఒక్కొక్క రేఖను ప్రవేశిస్తాడు. గడచిన ముప్పది దినములు సూర్యుడు ధనురేఖపై ఉండటం చేత దీనికి ధనుర్మాసమని పేరు పెట్టారు. ఈ ధనుర్మాసంలో స్త్రీలు అనేక మంగళ కార్యములను చేసుకొనేవారు. ధనుర్మాసము తీరిన తరువాత మకర సంక్రమణం ప్రారంభమవుతుంది.

## సూర్యుడు

సూర్యుడు నిస్వార్థపరుడు. నిరహంకారి. అతనిది సమానత్వముతో కూడినటువంటి తత్వము. అందరియందు ఏకత్వము వహించే భావము. సూర్యునికి విశ్రాంతి లేదు. నిర్విరామంగా తన కర్మను ఆచరిస్తుంటాడు. సంక్రమణ మనకు నేర్పే గుణపాఠమేమిటంటే సూర్యునితో పాటు మనము కూడా సూర్యుని అడుగుజాడలలో నడవటమే. సూర్యుడు నిస్వార్థపరుడు కనుక మానవులు కూడా నిస్వార్థ పరులుగా తయారుకావాలి. సూర్యుడు నిరహంకారి. ఇంత పని చేస్తున్నాననే అహంకారము అతనికి ఏ కోశానా ఉండదు. సూర్యుడే లేకపోతే జీవితమే లేదు. అన్ని విధములా ప్రకృతిని సౌందర్యవంతం చేసేవాడు సూర్యుడే. సూర్యుని వలననే సమస్త సృష్టి స్థితిలయములు జరుగుతున్నవి. ఇంత బాధ్యత వహించిన సూర్యునిలో అహంకారమే మాత్రం కనిపించదు. అల్పబుద్ధులతో అల్పపు పనులు చేసే వ్యక్తులకే ఇట్టి అహంకారము. "అన్నీ వడ్డించిన ఆకు అణగిమణగి ఉంటుంది. ఏమీ వడ్డించని ఆకు ఎగిరెగిరి పడుతుంది." నిండుకుండ తొణకుతుందా? తొణకదు. ఖాళీవుండే పాత్రలే తొణికేవి. పూర్ణుడైన సూర్యునియందు ఇట్టి అల్పభావములు, అల్ప బుద్ధులు ఏమాత్రం కనిపించవు. కనుక సూర్యునివలె ప్రతి మానవుడు నిరహంకారిగా తయారుకావాలి. వేదమునందు "చంద్రమా మనసోఽజాయతః చక్షోస్సూర్యో అజాయతః "ముఖాదింద్రశ్చ" - అని ఉంది. చంద్రుడు మన మనస్సని, చక్షువులు సూర్యుడని భావించుచున్నారు. ప్రతి మానవుని యందు సూర్యఅంశ ఉండటం చేత సూర్యుని అడుగుజాడలను అనుసరించడం మానవుని ప్రధాన కర్తవ్యము.

## కొబ్బరికాయ

మనం కొబ్బరికాయలు కొడుతుంటాం. కొబ్బరికాయ అంతరార్థమేమిటి? కొబ్బరికాయ పైన దట్టమైన పీచు ఉంటుంది. దానిని మేకుతో విడదీయాలి. తదుపరి దానిపై గట్టి చర్మము - చిప్ప ఉంటుంది. దానిని కొట్టినప్పుడు పరిశుద్ధమైన కొబ్బరి లభిస్తుంది. అది చిప్పకు కరచుకొని ఉంటుంది. మనము కొబ్బరికాయ కొట్టే సమయంలో పై పీచును మొదట తీసివేస్తాము. తదుపరి చిప్పను తీసివేస్తాము. కాయ కొట్టడానికి లక్ష్యమేమిటి? మన లక్ష్యము కొబ్బరి పైననే, చిప్పపైన కాదు. భగవంతునికి కొట్టినట్లే కొట్టి మనమే ఆరగిస్తున్నాము. మన జీవితం ఒక కొబ్బరికాయ వంటిది. అభిమాన మమకార లోకవాంఛలతో చేరినటువంటిది ఈ పీచు. అనేక వాసనలతో, నారలతో కూడినదీ పీచు. కనుక అభిమాన మమకారములనే ఈ పీచును మొదట తీసివేయాలి. తదుపరి అహంకారమనే కొబ్బరికాయను బ్రద్దలు చేయాలి. అప్పుడు నిర్మల నిశ్చల నిస్వార్థమనే తెలుపు మనకు చిక్కుతుంది. అదే భగవద్గుణము - నిర్మలమైన ప్రేమ. ప్రేమ అహంకారమనే చిప్పతో కూడివుంటుంది. అహంకారమనే చిప్ప అభిమాన మమకారమనే పీచుతో చేరి ఉంటుంది. అభిమాన మమకారములనే పీచే తమోగుణము. ఈ అహంకారమే చిప్ప. సాత్వికమనే కొబ్బరిని మనం ఆరగించాలి. దాని నిమిత్తమై మన హృదయాన్ని బ్రద్దలు చేయాలి. బద్దలు చేయటమంటే మర్మం లేకుండా, గోప్యం లేకుండా సర్వమూ అర్పితము చేయాలి. ఏకించిత్తు కూడా హృదయంలో మరుగు పెట్టుకున్నా అది పవిత్రమైన అర్పణ కానేరదు. అర్పితమనగా "నా ఇష్టము" ఉండకూడదు. అంతా "నీ ఇష్టమే". కొంతమంది అభిమానం కోసం, మమకారం కొరకు, లోకదృష్టి కోసం అంతా నీ ఇష్టమే స్వామీ! మా ఇష్టమేమీ లేదంటారు. ఇవి మాటలు మాత్రమే. ప్రాకృత సంబంధమైన స్టంట్లు! ఇవన్నీ దైవం ఒప్పేవాడు కాదు. నీవెన్ని బుక్కులు చదివినావో, వాటికంటె పెద్ద బుక్కులే చదివి ఉంటాడు తాను. అన్ని విద్యలూ తనలోనే ఉంటాయి. నీ విద్యలకు కాదు, హృదయ పవిత్రతకు మాత్రమే చిక్కుతాడు.

(సంక్రాంతి పర్వదినాన శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థ పూర్వ విద్యార్థినుల సమావేశములో శ్రీ సత్యసాయిబాబా చేసిన ప్రసంగం నుండి) ★

# దౌత్యనీతి ప్రదాత హనుమంతుడు

" సర్వానిష్ట నివారకం శుభకరం పింగాక్ష మక్షాపహమ్
సీతాన్వేషణ తత్పరం కపివరం కోటీందు సూర్యప్రభమ్
లంకాద్వీప భయంకరం సకలదం సుగ్రీవ సమ్మానినమ్
దేవేంద్రాది సమస్తదేవ వినుతం కాకుస్థదూతం భజే "

అనగా సకల అనిష్టములను నివారించువాడును, శుభంకరుడును, పసుపు పచ్చని కన్నులు గలవాడును, అక్షవధ చేసినవాడును, సీతాన్వేషణ తత్పరుడును, కోటీందు సూర్యసమ ప్రకాశుడును, లంకాద్వీప భయంకరుడును, సకల అభిమతార్థదాతయును, సుగ్రీవుని సమాదరము చేసినవాడును, దేవేంద్రాది సమస్త దేవతలచే ప్రశంసించబడిన వాడును, శ్రీరామచంద్రుని దూతయునగు హనుమంతునికి నమస్కరించుచున్నాను.

శ్రీ మద్రామాయణ మహా కావ్యమునుండి హనుమంతుని పాత్రను తీసివేయిస్తే అసలు కథే లేదేమోననిపిస్తుంది. ఉప్పులేని పప్పు ఏ విధముగా రుచింపదో, హనుమంతుడు లేని రామాయణం స్థితికూడా అంతే. ఈ మహాకావ్యంలో హనుమంతుడు ప్రధాన నాయకుడు కాకపోయినప్పటికీ, లంకా విజయం హనుమంతుడు లేకుండా సాధ్యపడేది కాదేమోననిపిస్తుంది. ఈయన శ్రీరామచంద్రునికి ఆత్మార్పణం గావించుకొనిన పరమ భక్తాగ్రేసరుడు. సర్వశక్తి సంపన్నుడు. మహావీర, విక్రమ బలపరాక్రమ సంపన్నుడు. సకలశాస్త్ర కోవిదుడు, ఉత్తమ భృత్యుడు, ప్రభుభక్తి పరాయణుడు. దౌత్యమును నెరపడంలో అతనికి అతనే సాటి. హనుమంతుని దౌత్యనీతి ప్రతి ఒక్కరూ చదివి అవగాహన చేసుకోవాలి. ముఖ్యంగా విదేశాంగ మంత్రులు, రాయబారులు, ప్రత్యేక దూతలు - హనుమంతుని పాత్రను చక్కగా అవగాహన చేసుకొనిన యెడల విదేశాలతో చక్కటి దౌత్య సంబంధాలను నెలకొల్పగలుగుతారు. దేశం యొక్క కీర్తి ప్రతిష్ఠలను యినుమడింపజేయ గలుగుతారు.

దుష్టులను శిక్షించుట కొరకు, శిష్టులను రక్షించుట కొరకు, రామ కార్యసిద్ధి కొరకు శివుడే హనుమంతుడుగా అవతరించి యున్నాడని పురాణములు ఘోషిస్తున్నాయి. సీతాన్వేషణ కొరకు హనుమంతుడు చేసన సాహసం ఎవరూ చేయలేరు. దైవాంశ సంభూతుడు కావడంవలననే అతి దుష్కరమైన కార్యములను సహితం విజయవంతంగా హనుమంతుడు నిర్వహించగలిగాడు.

యుద్ధభూమిలో అతడు ప్రదర్శించిన అత్యద్భుత వీర కృత్యములకు శ్రీరామచంద్రుడు సహితం ఆనంద పరవశుడై " అతని బాహుబలము వలననే నేను లంకను జయించితిని. సీతను తిరిగి పొందగలిగితిని, లక్ష్మణుడు తిరిగి దక్కినాడు, విజయము లభించినది, రాజ్యము లభించినది, బంధుమిత్రాదులను తిరిగి కలుసుకొనగలిగితిని. " అని హనుమంతుని ప్రశంసిస్తాడు. అంతే కాదు అతని బలపరాక్రమాదులను చూచి నివ్వెరపోయి, త్రిలోక విజేతయగు రావణాసురుడే స్వయంగా ప్రశంసిస్తూ " సాధు వానర వీర్యేణ శ్లాఘనీయో உసి మే రిపుః " " ఓ వానరా! శభాష్. నీవు శ్లాఘమును అందుకొనుటకు తగిన 'శత్రుడవు' అని అంటాడు. అతని వీరోచిత చర్యలను చూచి రావణుని ధైర్యం సన్నగిల్లుతుంది. తన శక్తి యందే తనకు అనుమానం ఏర్పడుతుంది. అప్పుడు ఇంద్రునితో సమానమైన ఇంద్రజిత్తుని పిలిచి హనుమంతుని బలపరాక్రమాదులను గురించి ఎరుక పరుస్తూ " బ్రహ్మాస్త్రమును పొందిన నీవు తప్ప, ఈ కోతిని ఎదిరించగల శక్తి సామర్థ్యములుగల వారెవ్వరూ నాకు

కనిపించడంలేదు. వీడితో బాహాబాహీ యుద్ధము పనికిరాదు. ఇతను సాధారణ బలసంపన్నుడు కాదు. వజ్రాయుధము వంటి ఆయుధములు సైతం అతనిని ఏమీ చేయజాలవు. అతని గతి మారుతిని గతిని, అతని శక్తి అగ్నిహోత్రుని అతిక్రమించినది " అని రావణాసురుడు సహితం వాపోతాడు. యుద్ధభూమిలో హనుమంతుడు చాకచాక్యంగా, సమయస్ఫూర్తితో నిర్వహించిన తీరును శ్రీరామచంద్రుడు అభినందిస్తూ " ఇటువంటి మహత్తర కార్యములను నిర్వహించగల సమర్థులు, ఈ భూమండలంలో హనుమంతుని లాగే మరెవ్వరూ నిర్వహించలేరు. ఇతడు చేసిన సాహసకృత్యాల వల్ల మొత్తం రఘువంశమే విపత్తుకు గురికాకుండా రక్షించబడింది " అని కొనియాడుతాడు. ఆత్మీయులు ప్రశంసించడంలో విశేషం లేదు. భగవంతుడే మానవరూపంలో జన్మించిన శ్రీరామచంద్రుడు మరియు సర్వశక్తి సంపన్నుడు, ముల్లోకములను గడగడలాడించిన రావణబ్రహ్మ సహితం ప్రశంసించడంలోనే వున్నది విశేషం. హనుమంతుడు మామూలు కోతి కాదు. దైవాంశ సంభూతుడు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. అంతేకాదు చక్కటి దౌత్యనీతి ప్రదాత హనుమంతుడు !

సీతను వెదకుటకు వానరసేనను సుగ్రీవుడు అన్ని దిక్కులా పంపిస్తాడు. వెదుకుతూ, వెదుకుతూ హనుమంతుడు వంద యోజనములుగల సముద్రమును దాటి లంకాపురి చేరుకుంటాడు. అతి కష్టంమీద సీతను అశోకవనంలో కనుగొంటాడు. లంకాపురి రాక్షసులకు తన శక్తిని కొంచం చవిచూపిస్తాడు. అడ్డువచ్చిన రాక్షసులను యమపురికి పంపిస్తాడు. హనుమంతుని ధాటికి ప్రహస్తుని కుమారుడైన జంబుమాలి శరీరం నుగ్గునుగ్గయిపోతుంది. అక్షయుడు అస్తమిస్తాడు. ఐదుగురు సేనాధిపతులు, ఏడుగురు మంత్రి కుమారులు పరలోకం చేరుకుంటారు. అక్షయుడు మరణించాడనే వార్త వినగానే రావణుడు కంపించిపోతాడు. అప్పుడు రావణుని ఆదేశానుసారం ఇంద్రజిత్తు రంగప్రవేశం చేస్తాడు. హోరాహోరీగా యుద్ధం జరుగుతుంది. ప్రయోజనం కనిపించదు. అప్పుడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. బ్రహ్మాస్త్ర మహిమ తెలిసిన హనుమంతుడు ఒక్క ముహూర్తకాలం క్రిందపడి వుంటాడు. రాక్షసులు మోకులతో హనుమంతుడ్ని బంధించుతారు. తాళ్ళతో బంధించడంతోనే బ్రహ్మాస్త్రశక్తి పోనేపోతుంది. ఆ విషయం హనుమంతునికి బాగా తెలిసికూడా మెదలకుండా పడి ఉంటాడు. రావణాసురుని చూచే అవకాశం లభిస్తుందని లోలోన సంతోషిస్తాడు. అదే జరుగుతుంది. రాక్షసులు అతనిని మోసుకుని పోయి, రావణాసురుని కొలువు కూటంలో హనుమంతుడ్ని హాజరు పరుస్తారు. రాజాజ్ఞ ప్రకారం మంత్రి ప్రహస్తుడు లేచి హనుమంతుని రాకకు కారణం, పూర్వాపరాలను ప్రశ్నిస్తాడు. హనుమంతుడు కోరుకొనిన సమయం ఆసన్నమైనందుకు లోలోన సంతోషించి ధైర్యంగా హనుమంతుడు సమాధానం ఇచ్చిన రీతి ప్రశంశనీయం. అంతేకాదు దూతలు, రాయబారులు నేర్చుకోవలసిన నీతికూడా దీనిలో ఎంతో వున్నది. ఆయన ఆనాడు ప్రదర్శించిన సమయోచిత పాత్ర, చూపిన చాతుర్యం, పలికిన పలుకులు సునిశితంగా పరిశీలిస్తే ఆయనలో ఉత్తమ దౌత్య లక్షణాలు ఎన్నో మనకు కనిపిస్తాయి. ఆయన ఒక్క బాహుబలంలోనేగాక బుద్ధిబలంలో కూడా సాటిలేని మేటి అని ఋజువవుతుంది.

ఆ కొలువుకూటంలో హనుమంతుడు "నేను సుగ్రీవుని దూతను, నా ప్రభువైన సుగ్రీవుకు రామలక్ష్మణులతో సఖ్యం చేసుకొనినాడు. అతి బలాఢ్యుడైన వాలిని ఒక్క వేటుతో శ్రీరామచంద్రుడు సంహరించి సుగ్రీవుని కోరికను నెరవేర్చినాడు. కృతజ్ఞతతో సుగ్రీవుడు తన వానరసేనను సీతాదేవి జాడను తెలిసికొనుటకు భూలోకమంతా వెదకమని పంపించినాడు. ఆ సందర్భమున నేను సముద్రమును లంఘించి లంకలో అడుగుపెట్టాను. భర్త కోసం నిరీక్షిస్తున్న సీతను అశోకవనంలో చూచాను. అటువంటి పతివ్రతా శిరోమణి అయిన సీతాదేవిని అపహరించడం ధర్మ విరుద్దం. పరాయి స్త్రీని కోరడం మహా

పాపం. ఇది తమ కుల నాశనానికి దారి తీస్తుంది. సర్వ శక్తివంతుడైన శ్రీరామునితో వైరం అంత మంచిది కాదు. అది మీ వంశ సర్వనాశనానికి దారి తీస్తుంది. వానరరాజు దూతనైన నా పలుకులను ఆలకించి, పతివ్రతా శిరోమణి అయిన సీతను శ్రీరామునికి ఒప్పగించి, మీ లంకాపురిని, మీ పరివారాన్ని, మీ బంధుమిత్రులను రక్షించుకొనండి " అని స్పష్టం చేశాడు. బందీనయినాననే భయం కూడా లేకుండా, ఎంతో హుందాతనంగా రావణుని హెచ్చరించాడు. ఈ పని నిజంగా సామాన్యులకు చేత కాదు.

హనుమంతుని మాటలు వినిన లంకేశ్వరుడు క్రోధోద్రిక్తుడై, రోషావేశంతో "ముందు ఈ కోతిని చంపి, తరువాత మరొక పని చూడండి. " అని రాక్షస సేనను ఆజ్ఞాపిస్తాడు. సభలోనున్న విభీషణుడు లేచి " దూతను చంపడం రాజనీతికి వ్యతిరేకము. ఒకవేళ విదేశీదూత మన రాజ్యరక్షణకు భంగం కలిగే పనులు చేసినాడని ఋజువు అయిన యెడల, అట్టి దూతను వికలాంగుని చేయడంగాని, కొరడాలతో కొట్టడంగాని, వాతలు వేయడంగాని చేయవచ్చునుగాని, మరణదండన విధించడం ధర్మం కాదు ఇతనిని చంపివేస్తే శత్రువులు యిక్కడికి వచ్చే అవకాశమే పోతుంది. ప్రాణాలతో వదిలిపెడితే శత్రువులు యిక్కడికి రావడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు మన బలం వారికి చవిచూపించవచ్చును" అని అంటాడు. రావణుడు విభీషణుని ఆలోచనతో ఏకీభవించి " ఆ కోతి తోకకు నిప్పు ముట్టించి తరిమి వేయండి " అని ఆజ్ఞాపిస్తాడు.

రాక్షసులందరూ చుట్టూచేరి హనుమంతుని తోకకు గుడ్డలు చుడుతారు. నూనెపోసి నిప్పు అంటించుతారు. హనుమంతుడు తన శరీరాన్ని ఒకేసారి పెంచి విదిలిస్తాడు. అంతకు పూర్వం కట్టిన కట్లన్ని పటాపంచలవుతాయి. విశ్వరూపం దాల్చి మండుతున్న తోకతో పైకి ఎగిరి ఒక పెద్ద భవనం మీద నుంచుంటాడు. ఒక భవనం మీదనుండి మరొక భవనం మీదికి దుముకుతూ నిప్పుపెడుతూ స్వైర విహారం చేస్తాడు. ఒక్కక్షణంలో లంకాపురి అంతా అగ్ని జ్వాలలు అంటుకుంటాయి ఇంతలో సీత గుర్తుకొస్తుంది. సీతాదేవి కూడా అగ్నికి ఆహుతి అయిపోయిందేమోనని బాధ పడుతాడు. అశోకవనం చేరుతాడు. సీత సురక్షితంగా వుండటం చూచి ఆనందించుతాడు. సీతాదేవికి నమస్కరించి ధైర్యం చెప్పి తిరిగి ప్రయాణమవుతాడు. హనుమంతుడు సమయస్ఫూర్తితో ప్రదర్శించిన బల పరాక్రమాదులు, రావణునితో సంభాషించినప్పుడు అనుసరించిన నీతి కోవిదత్వము. దూతగా నిర్భయంగా, సమయోచితంగా, అతడు నిర్వహించిన కుశలత్వము, నిరాశా నిస్పృహలతో కుమిలి కృశించి చిక్కి శల్యమై జీవచ్ఛవంలావున్న సీతకు ఆత్మవిశ్వాసమును కలుగజేయ డానికి చాకచక్యంతో కూడిన అతని ప్రయత్నం, ఓర్పు, మానసికధృతి, ఆత్మస్థైర్యము, త్రోవలో అతనిని అడ్డగించిన సురస, సింహికలను చంపుటలో అతను ప్రదర్శించిన ప్రజ్ఞాపాటవములు అసమానములు.

సీతాదేవి వద్ద శలవు తీసుకొని సముద్రమును దాటుచున్న హనుమంతునికి విశ్రాంతి చేకూర్చదలచిన మైనాకునితో "నేను ఆగుటలేదని కోపగించకుము. నీ ఆతిధ్యమును స్వీకరించలేక పోతున్నందుకు అన్యధా భావింపకుము. ప్రొద్దు గ్రుంకుతున్నది. నాపై గల రాజ్య భారమును బట్టి నేనాగుటకు వీలులేదు. " అని చెప్పి చేతితో అతనిని (పర్వతమును) స్పృశించి, పైకి ఎగిరి తన మార్గమున తాను శీఘ్రముగా పోతాడు. ఈ సంఘటననుబట్టి హనుమంతునిలోగల కర్తవ్యపరాయణత్వము, కార్యదీక్ష, పట్టుదల ఎంతటి దృఢమైనవో మనము అర్థం చేసుకొనవచ్చును. రాచకార్యములు నిర్వహించు వారు అప్రధానములగు కార్యములచేత ఆకర్షించబడ కూడదు. అసలు కార్యములను సకాలంలో నిర్వహించడం

నేర్చుకోవాలి. అప్పుడే కార్యాలు సాఫల్యమవుతాయి. విందులు, వినోదాలతో కాలం వృథా చేస్తున్న నేటి మంత్రులకు హనుమంతుని కార్యదీక్ష ఆదర్శం కాదా? రాచకార్యార్థం నియమించబడిన వారు కర్తవ్య పరాయణులు గను, దూరదృష్టి గలవారుగను ఉండటం ముఖ్యమని హనుమంతుని సచ్ఛీల చరిత్ర మనకు చాటుచున్నది.

లక్ష్మణుడు యుద్ధభూమిలో మూర్ఛిల్లినప్పుడు ఆకాశ మార్గమున సంజీవి పర్వతానికి చేరుకుంటాడు. అయితే ఆ పర్వతం మీద సంజీవి చెట్టు ఏదో గుర్తించలేక పోతాడు. ఆలస్యం అయితే లక్ష్మణుని ప్రాణాలు పోతాయి. ఆ దుఃఖంలో శ్రీరాముడు ప్రాణత్యాగం చేయవచ్చును. రిక్త హస్తములతో తిరిగి వెళ్ళదలచలేదు. చివరికి ఆ సంజీవి పర్వతాన్నే పెకలించి, చేతబూని వాయువేగంతో లంకను చేరుతాడు. ఈ సంఘటననుబట్టి హనుమంతుని దృఢ సంకల్పం ఎట్టిదో మనం బాగా అర్థం చేసుకోవచ్చును. ప్రస్తుత సమాజంలో అటువంటి దృఢ సంకల్పులు, కర్తవ్య నిష్ఠుల కొరత వుండటం వలననే రాచకార్యాలు దెబ్బతింటున్నాయి.

హనుమంతుడు తన కప్పగించిన ప్రభుకార్యమును నిర్వహించుటలో అడుగడుగున చూపిన జాగరూకత, దీర్ఘదర్శిత్వము, మనోనిగ్రహము, సమయోచిత కార్య నిర్వహణ దక్షత, పట్టుదల – వర్తమాన రాజకీయ ప్రపంచమున మెలగు రాజకీయ దురంధరులు, రాయ బారులు, విదేశాంగ మంత్రులు మార్గదర్శకత్వంగా స్వీక రించిన శుభదినాన చక్కటి సాంప్రదాయ దౌత్యనీతిని నెలకొల్పినవారవుతారు. ఆ శుభ సమయం ఎప్పుడు వస్తుందో!

– కొమరగిరి

# భారత్‌పై అప్పులభారం

1985 డిశంబరు 31 నాటికి భారతప్రభుత్వం ఐ. డి. ఏ, ప్రపంచ బ్యాంక్, ఐ. ఎం. ఎఫ్ వంటి అంతర్జాతీయ సంస్థలకు రు. 13,500 కోట్లు (పదమూడు వేల ఐదు వందల కోట్లు) రూపా యిలు అప్పుపడింది. అదే కాలానికి స్వదేశీ ఋణం రు. 70,427 కోట్లు (డెబ్భై వేల నాలుగు వందల ఇరువై ఏడు కోట్లు) చెల్లించవలసివున్నది. ఇదిగాక ఐ. ఎం. ఎఫ్. ఋణసదుపాయం క్రింద తీసుకున్న రు. 47:6 కోట్లు (నాలుగువేల ఏడు వందల ముప్పైఆరు కోట్లు) చెల్లించవలసివున్నది. 1985-86 సంవత్సరంలో ఒక్క స్వదేశీఋణంపై భారత ప్రభుత్వం రు. 3856 43 కోట్లు (మూడు వేల ఎనిమిది వందల యాభై ఆరు కోట్ల వలభై మూడు లక్షలు) వడ్డీ క్రింద చెల్లించవలెను. భారత్‌పై నానాటికి అప్పులభారం పెరుగుతున్నది. అంటే ప్రతి భారత పౌరుని మీద (చిన్న పెద్ద తారతమ్య భేదాలు లేకుండా) షుమారుగ రు. 1300 (పదమూడువందలు) వ్యక్తిగత అప్పులు కాకుండా సామాజిక అప్పు భారం పడుతున్న దన్నమాట! ఋణభార ప్రభావం పన్నుల మీద, పన్నుల ప్రభావం ధరల మీద పడి సామాన్యుడు సతమత మవడం జరుగుతున్నది.

* పై గణాంక వివరాలు ది. 14-3-1986 న లోక్ సభలో ఆర్థికశాఖ సహాయమంత్రి శ్రీ జనార్ధనపూజారి యిచ్చారు.

# స్వాతంత్ర్య సమరయోధుడు

# శ్రీ గోపాలకృష్ణగోఖలే

ఆంగ్లేయులను పారద్రోలడానికి 1857లో ప్రథమ స్వాతంత్ర్య పోరాటం భారీ ఎత్తున జరిగింది. ఝాన్సీరాణి, తాంతియాతోపే, నానా ఫడ్నవీసు లాంటి వీర వనితలు, వీరాగ్రేసరులు నాయకత్వం వహించారు. ఎంతోమంది దేశభక్తులు నేలకొరిగారు. భారతదేశ స్వాతంత్ర్య పోరాట చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించ వలసిన సమయం అది. అయితే దానిని బ్రిటీషువారు సిపాయి కలహంగా వర్ణించడం అసలు చరిత్రను తారుమారు చేయడమే తప్ప మరొకటి కాదు.

1858 లో ఈస్టిండియా కంపెనీ పాలన అంతమొంది విక్టోరియా మహారాణి ప్రకటనతో ఒక కొత్తశకం ప్రారంభ మైంది. 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించ బడింది. ఆ సంస్థ అనేక పోరాటాలను సాగించి అనేక కష్టనష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్నది. అయినప్పటికి సంపూర్ణ స్వారాజ్యం కనుచూపు మేరలలో కనిపించలేదు. నిరాశ, నిస్పృహ, నిరుత్సాహం ఎదుర్కొనవలసి వచ్చింది. ఆంగ్లేయులు ఆయుధబలంతో జాతిలో తలఎత్తిన స్వాతంత్ర్య పిపాసను అణచివేయడం ప్రారంభించారు. కాని ప్రజలలో స్వాతంత్ర్యం సంపాదించాలనే కాంక్ష, పట్టుదల తీవ్రరూపం దాల్చింది. సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం ప్రత్యక్ష పోరాటం సాగించాలని అతివాదులు పట్టు పట్టారు. అయితే జాతీయ కాంగ్రెసుకు ఆనాడు మిత వాదులు నాయకత్వం వహించారు. వారి ఆలోచనా సరళితో ప్రజలు అసంతృప్తులైనారు. అతివాద నాయకులను నిర్బంధంలో ఉంచి మితవాద కాంగ్రెసు నాయకులతో బ్రిటిష్ ప్రభుత్వం సంప్రదింపులను ప్రారంభించింది. నిరాశా నిస్పృహలు అలముకున్నాయి. కాంగ్రెసు నాయకత్వం యెడల విశ్వాసం సన్నగిల్లింది. అటువంటి పరిస్థితులలో గోపాలకృష్ణ గోఖలే రాజకీయ రంగ ప్రవేశం చేసారు. విద్యా సేవతో ప్రారంభమైన ఆయన జీవితం రాజకీయ ఆందోళనలతో అంతమయింది.

ఆనాటి బొంబాయి రాష్ట్రంలోని రత్నగిరి జిల్లా "కోతుల్" అనే కుగ్రామంలో గోఖలే 1866 మే 9న జన్మించారు. తండ్రి కృష్ణారావు కొల్హాపూర్ సంస్థానంలో ఒక జమీందారీలో చిన్న ఉద్యోగిగా చేరి సబ్ ఇన్‌స్పెక్టర్ స్థాయి వరకు ఎదిగారు. కృష్ణారావుకి నలుగురు ఆడ పిల్లలు. ఇద్దరు మొగపిల్లలు. పెద్దవాడు గోవింద్, చిన్న వాడు మన గోపాల్. తల్లి పెద్ద విద్యావంతురాలు కాదు కాని భారతదేశ ఇతిహాస పురాణాలు చదివింది. ప్రాతః కాలముననే లేచి భక్తిగీతాలు పారాయణం చేయడం, రాత్రి వేళల సాంప్రదాయకమైన భక్తి పాటలు, శ్లోకాలు చదువు కొని నిద్రించడం ఆమె అలవాటు. భారత రామాయణ కథలు పిల్లలకు చెప్పడం ఆమె నిత్యకృత్యం. వీటి ప్రభావం గోఖలే మీద చెరగని ముద్ర వేయబడింది.

గోఖలే చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన విశేష ప్రచారంలో ఉన్నది. తరగతి ఉపాధ్యాయుడు ఇంటికి లెఖ్ఖలు [Home Work] ఇచ్చాడుట. పిల్లలందరూ తప్పు చేసారుట. గోఖలే మాత్రం అన్నీ రైటు చేసుకొని వచ్చాడు. ఆ ఉపాధ్యాయుడు సంతోషించి గోఖలేను పిల్లలందరికంటే ముందు కూర్చొబెట్టాడుట. అయితే గోఖలే ఏడ్వటం మొదలుపెట్టాడు. కారణమేమిటని విచా రించగా ఈ లెఖ్ఖలు తాను స్వయంగా చేసినవి కావని, ఎవరో పెద్దవారి సహాయంతో చేసినవని నిజం చెప్పి పెద్దగా ఏడ్చాడుట. కాపీలతోనే పరీక్షలలో ఉత్తీర్ణు

లవ్వాలని తాపత్రయపడే విద్యార్థులకు గోఖలే ప్రవర్తన ఎంతగా తోడ్పడి వీలైతే తోయవచ్చునుగాని బాగుపడాలని ఆలోచించే వారికి మాత్రం గోఖలే బాల్యజీవితం చక్కటి ఆదర్శవంతమవుతుంది.

గోఖలే 13 సం. వయస్సులో తండ్రి మరణించారు. సామాన్య కుటుంబీకులు కావడం వలన వారి కుటుంబ పరిస్థితి తారుమారైంది. అన్న గోవింద్ విద్యకు స్వస్తి చెప్పి 18 వ ఏటనే రు 15 ల జీతానికి చేరాడు. తమ్ముడికి నెలకు 8 రూపాయలు పంపించేవాడు. అతి జాగ్రత్తగ ఖర్చుపెట్టి చదువుకునేవాడు. ఒకనాడు ఒక విచిత్ర సంఘటన జరిగింది. మిత్రుని ప్రోద్బలంతో ఒక నాటకం చూచాడు. కొంత కాలానికి ఆ మిత్రుడు టిక్కెట్టు డబ్బు యివ్వమని డిమాండ్ చేసాడు. అతి కష్టంమీద రెండు అణాలు మిత్రుడికి గోఖలే యిచ్చాడు. అయితే ఆ రెండు అణాలు పూడ్చుకోవడం అతి కష్టమైంది. కిరసనాయిలు కొనడం మానివేసి వీధి దీపం దగ్గర చదువుకోవడం మొదలుపెట్టాడు గోఖలే. 15 వ ఏట మెట్రిక్యులేషన్ ప్యాసయినాడు. ఆనాటి ఆచారాన్ని అనుసరించి వివాహము అంతకుముందే అయిపోయింది. ఎంట్రన్స్ పరీక్షలో కూడా ఉత్తీర్ణుడయినాడు. అయితే మార్కులు ఆశించినంత ఎక్కువగా రాకపోవడం వలన ఉన్నత చదువుకు వెళ్ళకుండా ఉద్యోగంలో చేరుదామనుకున్నాడు. అయితే వదినగారు తన బంగారం అమ్మి అయినా సరే మరిదిని చదివించాలని పట్టుపట్టింది. ఆనాటి ఆమె త్యాగమే గోఖలే అభ్యున్నతికి కారణభూతమైనది. 1882 లో కొల్హాపూర్ కాలేజీలో చేరాడు. అతని జ్ఞాపకశక్తికి విద్యార్థులు ఆశ్చర్యపోయేవారు. పాఠ్య పుస్తకమును తోటి విద్యార్థికి యిచ్చి ఒక్క తప్పుకూడా లేకుండా గడగడా చెప్పేవాడుట. తప్పుకు అణా యిస్తానని పందెం వేసేవాడుట. అయితే ఆయన ఎప్పుడూ ఓడిపోలేదు. ఒక్క అణాకూడా చెల్లించలేదు. అది ఆయన మేధాశక్తికి చక్కటి నిదర్శనం.

ఆయన చదువుకునే రోజులలో ఒక ముఖ్య సంఘటన జరిగింది. పూనాలో రాజకీయ కారణం కోసం వేసిన ఒక నాటకంలో స్త్రీ పాత్రను గోఖలే ధరించి ప్రేక్షకుల మెప్పును పొందారు. అది షేక్స్పియర్ రచించిన "కామెడీ ఆఫ్ ఎర్రర్స్". ఈ నాటకం వేయడానికి ప్రధాన కారణం - కొల్హాపూర్ దివాన్ను "కేసరి", "మరాటా" పత్రికలు విమర్శించినందుకు ఆ సంపాదకులకు శిక్ష విధించింది బ్రిటీషు ప్రభుత్వం. వారి విడుదలకు కోర్టు ఖర్చుల నిమిత్తం విరాళములు సేకరించేందుకు పై నాటక ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. బొంబాయిలో డిగ్రీ చదువుతున్నప్పుడూ విద్యార్థి వేతనం రు 20 లు ఆయనకు లభించింది. 18వ సంవత్సరంలోనే బి. ఏ. ప్యాసయినాడు. అంత చిన్నతనంలో బి. ఏ. పరీక్ష ప్యాసు కావడం అరుదు. అయితే ఇది ఒక అగ్ని పరీక్ష అయింది. ప్రభుత్వ సర్వీసులో చేరడమా ? లేక యం. ఏ. చదవడమా ? లేక న్యాయవాది కావడమా ? స్నేహితులంతా కలిసి విరాళములు వసూలుచేసి యిస్తామన్నారు. ఇంగ్లండు వెళ్ళి ఐ సి. యస్. పరీక్షకు కట్టమని వత్తిడి చేసారు. అయితే ఆయన యిష్టపడలేదు. పూనాలోని దక్కన్ కాలేజీలో 'లా' తరగతులలో చేరాడు. అయితే తన కొరకు త్యాగం చేసిన కుటుంబాన్ని విస్మరించలేకపోయాడు. న్యూ ఇంగ్లీషు స్కూలులో రు 5 ల జీతానికి ఉపాధ్యాయుడుగా చేరాడు.

గోఖలే ప్రజాసేవ విద్యారంగంతో ప్రారంభమైంది. తిలక్, అగర్కర్‌ల ప్రభావం ఆయన మీద పడింది. అగర్కర్ ప్రోత్సాహంతో ఆయన న్యూ ఇంగ్లీషు స్కూల్ యావజ్జీవ సభ్యునిగా 1886 లో చేరాడు. అదే అతని ఉజ్వల భవిష్యత్తుకు పునాది అయింది. గోఖలే ఒక బహిరంగ సభలో మొట్టమొదటగా ఆంగ్లంలో ఉపన్యసించి శ్రోతల మెప్పును పొందాడు. కొంతకాలం తరువాత గోఖలే "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ"ని స్థాపించారు. ఆనాడు రాజకీయాలు, పత్రికారంగం ఒకదానితో ఒకటి పెనవేసుకొని ఉండేవి. అంతేకాదు

రాజకీయ, సాంఘిక రంగాలలో ప్రజా ప్రచారానికి నాటకం ఒక ముఖ్య సాధనంగా ఉండేది.

గోఖలే విద్యారంగంలో ముఖ్యంగా ప్రాథమిక విద్యా విషయంలో విశేష కృషి చేసాడు. ప్రాథమిక విద్య ఉచితంగా గరపాలని, 6-10 సం. బాలబాలికలకది నిర్బంధం చేయాలని పట్టుపట్టాడు. విద్యపై పెట్టే ఖర్చులో రెండువంతులు ప్రభుత్వం, ఒక వంతు స్థానిక సంస్థలు భరించాలని వాదించాడు. తన వాదానికి బలంగా గ్లాడ్‌స్టక్ మాటలను ఉటంకించాడు. ("నాగరికతలో ముందంజ వేశామంటున్న మనలాంటి భాగ్యవంతులమైన దేశమే విద్యను నిర్బంధం చేయకపోవడం సిగ్గుచేటు").

గోఖలే జీవితంపై మహదేవ గోవిందరానడే ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. రానడే రాజకీయాలలోనేగాక ఆర్థిక సమస్యలపట్ల కూడా బాగా ఆసక్తి చూపేవారు. విదేశీ వస్తువుల దిగుమతిని వ్యతిరేకించేవారు. పరిశ్రమలు వృద్ధిచెందినప్పుడే భారతదేశం అభివృద్ధి గాంచుతుందని వాదించేవారు. గోఖలే రానడేగారిని తన రాజకీయ గురువుగా ఎన్నుకున్నాడు. రానడే మరణానంతరం గోఖలే సార్వజనిక సభ కార్యదర్శిగా తన ప్రజాహిత జీవనం ప్రారంభించాడు. వెల్బీ కమీషన్ ఎదుట, రాయల్ కమీషన్ ఎదుట ఆయన ఇచ్చిన సాక్ష్యం చెప్పుకోదగ్గది. పన్నులు చెల్లించే భారత ప్రజల మాట చెల్లుబడికాకుండా, ఎన్నో వేల కొలది మైళ్ళ దూరంలోనున్న ఇంగ్లండు వారి ఆధిపత్యం ఏమిటని ప్రశ్నించాడు. ఆఫ్ఘనిస్థాన్, బర్మాలలో సామ్రాజ్య విస్తరణకు భారత ప్రజలనుండి వసూలు చేసిన డబ్బు ఖర్చు చేయడం న్యాయం కాదని కమీషన్ ముందు వాదించాడు. వీరి వాదనను ఇంగ్లండులోని పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. గోఖలే ఖ్యాతి దేశమంతటా వ్యాపించింది.

1898లో లాహోర్ కాంగ్రెసులో దాదాభాయి నౌరోజి అధ్యక్షునిగా ఎన్నికైనాడు. బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. గోఖలే సంతోషానికి అంతులేకపోయింది. గుర్రపుబగ్గిలో తోలేవాడి ప్రక్కన కూర్చుని, జేబురుమాల ఊపుతూ, పెద్ద గొంతుతో నినాదాలిస్తూ ఆ ఊరేగింపులో పాల్గొన్నాడు. తిలక్, గోఖలేలు యిద్దరూ ఒకే పర్యాయం 1889 లో కాంగ్రెసులో ప్రవేశించారు. వీరిరువురు పూనా మహాసభకు ముందు కాంగ్రెసు కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. కాంగ్రెసు మహాసభల తరుణంలో గోఖలే ప్రతి దినం ఒక సమాచార పత్రమును వెలువరించాడు. గోఖలే 1905, సెప్టెంబర్ 16న లండన్ బయలుదేరాడు. ఇంగ్లండులోనున్న 50 రోజులలో 45 సమావేశాలలో ప్రసంగించాడు. రోజుకు 18 గంటలు పని చేసేవాడు. ఆ రోజులలో కాంగ్రెస్ సంస్థ ఇంగ్లండులో "ఇండియా" అనే పేరుతో ఒక పత్రికను ప్రచురించేది. గోఖలే ప్రసంగాలు ఆ పత్రికలలో ప్రచురించడంవలన ఆ పత్రిక చందాదారుల సంఖ్య పెరిగింది. 1905 డిశంబరులో స్వదేశానికి తిరిగివచ్చాడు. గోఖలేను కాంగ్రెస్ అధ్యక్షునిగా చేయాలని ఆహ్వానసంఘం వారు భావించారు. అయితే తనకు 40 సంవత్సరాలేనని చెప్పినప్పటికీ వినకుండా గోఖలేను కాంగ్రెసు అధ్యక్షునిగా చేసారు. గోఖలే భుజస్కంధాలపై పెద్ద భారమే పడింది. ఒక ప్రక్క బెంగాల్ విభజన ఉద్యమం తారాస్థాయినందుకున్నది. ఇటువంటి ఉద్రిక్త పరిస్థితులలో "బెనారస్" మహాసభ జరుగుతున్నది. గోఖలే అధ్యక్షపీఠం అలంకరించారు. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో చిన్నవాడైన గోఖలే విధులను ఎలా నిర్వర్తిస్తాడా? అని అందరూ భావించారు. అధ్యక్షపీఠం నుంచి గోఖలే "మన దేశీయులు ఈ దుస్థితినుంచి బయటపడాలంటే ఒక్కటే మార్గం-సహాయ నిరాకరణమే తిరుమంత్రం" అనిన ఆయన పలుకులు సభ్యులలో ఉత్సాహం, ప్రోత్సాహం కలుగజేసాయి. విదేశీ వస్తు బహిష్కరణ నినాదం యిచ్చాడు. వ్యవసాయమును, చేనేతను అభివృద్ధిచేయాలని నొక్కి వక్కాణించాడు. బెనారస్ కాంగ్రెస్ సభలలో ప్రారంభమైన ఈ ఉత్సాహం 1907లో సూరత్‌లో జరిగిన మహాసభలలో పెద్ద ప్రభంజనంగా మారింది.

భారతదేశ భవిష్యత్తును తీర్చి దిద్దిన మహనుభావులు గోఖలే, గాంధీలు. వీరిరువురూ అనేక విషయాలపై విభిన్న అభిప్రాయాలు కలవారు. అయినప్పటికీ దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యపై ఏకత్రాటి మీద నడిచారు. 1909 లాహోర్ కాంగ్రేసులో గోఖలే ఈ సమస్య మీద తీర్మానం ప్రవేశపెట్టారు. ఆ సమయంలో చేసిన వీరి ఉపన్యాసం చిరస్మరణీయం. గాంధీజీ, గోఖలేను దక్షిణాఫ్రికా వచ్చి అక్కడి భారతీయుల కడగండ్లను కళ్లారా చూడమని ఎన్నో పర్యాయాలు కోరారు. 1912 అక్టోబర్‌లో కేప్‌టౌన్ పట్టణానికి వెళ్ళారు. బ్రహ్మాండమైన స్వాగతం లభించింది. 5 బండ్లలో ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు కూడా జరిగింది. "వందేమాతరం" నినాదం మిన్నుముట్టింది. అక్కడ నుంచి "జోహానిస్ బర్గ్" వెళ్ళారు. అక్కడ ఒక పెద్ద విందు ఏర్పాటు చేసారు. 150 మంది యూరోపియన్లు కూడా ఆ విందుకు ఆహ్వానించబడ్డారు. ఆంగ్లేయులు, భారతీయులతో బహిరంగంగా విందులో పాల్గొనటం అదే ప్రథమం. గోఖలే ప్రసంగించారు. భారతీయుల దృక్పధాన్ని స్పష్టీకరించారు. ఆ పట్టణంలోనే భారతీయుల కొరకు మరొక సభ ఏర్పాటు చేయబడింది. ఆ సభలో ఇంగ్లీషులో మాట్లాడకుండా మరాఠీలో ప్రసంగించారు. హిందూస్థానీలో గాంధీజీ తర్జుమా చేసారు. ఇంకా అనేక పట్టణాలలో ప్రసంగించారు. గాంధీజీ తర్జుమా చేసారు. అక్కడి భారతీయులలో నూతన ఉత్సాహం పెల్లుబికింది. గోఖలేకి ఘనంగా వీడ్కోలు లభించింది. గాంధీజీని భారతదేశానికి వచ్చి భారత జాతి సాగించే స్వాతంత్ర్య పోరాటానికి సారధ్యం వహించమని గోఖలే కోరారు. 1905 నుంచి 1914 వరకు దక్షిణాఫ్రికాలో జాతి పోరాటం తీవ్రంగా సాగింది. అక్కడ పరిస్థితులు చక్కబడిన పిమ్మట గాంధీజీ భారతదేశానికి తిరిగివస్తూ లండన్‌లో దిగారు గోఖలే ఆరోగ్య కారణాల వలన పారిస్‌కు వెళ్ళడంచేత లండన్‌లో వారిని గాంధీజీ కలువలేకపోయారు గోఖలే కూడా 1914 లో భారతదేశానికి తిరిగివచ్చారు. వైద్యులు పరీక్షించి 3 సంవత్సరములకు మించి జీవించడం కష్టమని చెప్పారు. గాంధీజీ పూనా వెళ్ళి గోఖలేను కలిసారు.

ఒకానొకప్పుడు తన చరమదశలో తాను వేదాంతిని కావాలని కోరుకున్నాడు. అలాగే ఆయన జీవితం పట్ల ఆశలను త్రెంచుకున్నాడు. తన సోదరిని, కుమార్తెలను దగ్గరికి పిలిచి, తన మరణానంతరం శోకించవద్దని కోరాడు. తన సొసైటీ సభ్యులందరివద్ద శలవు తీసుకున్నాడు. వంటవానితో కూడా చక్కగా మాట్లాడాడు. ఆప్టే అనే తన స్నేహితుని పిలిచి "జీవితంలో వెలుగు అంతా చూచాను. మిగిలిన భాగం యిప్పుడు చూడబోతున్నాను" అన్నాడు గోఖలే ఎప్పుడూ తన ధోవతి, చొక్కాను పరిశుభ్రంగా ఉంచుకోవడం ఆయన అలవాటు. మంచిగా ఉతికిన ధోవతిని, చొక్కాను ధరించి తాను ఎప్పుడూ కూర్చుండే పొడుగు చేతుల కుర్చీలో కూర్చున్నాడు. కొన్ని క్షణాల తరువాత ఆయన తన వేలిని ఆకాశం వంకకు చూపించాడు. చేతులెత్తి నమస్కరించాడు. ఆ ప్రశాంత వాతావరణంలో ది 19-2 1915 రాత్రి గం. 10-15 ని.లకు గోఖలే శాశ్వతంగా కన్ను మూసారు.

గోఖలే ఎన్నడూ ధ్యానం చేయలేదు. విగ్రహాల ముందు కూర్చొని సంకీర్తనలు, భజనలు చేయలేదు. తీర్థయాత్రలు అసలే చేయలేదు. అయినప్పటికి తాను ఏ పనిని తలపెట్టినా, అది భగవంతుని ఆదేశమని భావించి చిత్తశుద్ధితో నిర్వర్తించడం ఆయన లక్ష్యం. భారతదేశ స్వాతంత్ర్య సమర పోరాటంలో అగ్రభాగాన నిలిచి పోరాడిన మహాయోధుడు, అకలంక దేశభక్తుడు. ఆయన చరిత్ర భారత యువకులకు ఆదర్శవంతమైనది. స్ఫూర్తి ప్రదాయకమైనది.

కొమరగిరి కృష్ణమోహనరావు

# కళా తాత్త్విక జగత్తుల సహజీవనం సాధ్యమా?

గ్రీకు తాత్త్వికుడైన ప్లేటో, రిపబ్లిక్‌లో కళాకారులను కళారసజ్ఞుల కన్నా తక్కువ స్థాయివారని పేర్కొనటమూ – మన అలంకార శాస్త్రములలో దార్శనికులను (తాత్త్వికులను) రసానుభూతి పొందలేని నాటక శాలలోని స్తంభములతో పోల్చటమూ జరిగింది.

ఈ నిర్వచనములను ప్రక్కప్రక్క యుంచి చూసినప్పుడు కళ-తాత్త్విక జగత్తులు అనునవి విరుద్ధస్వభావాలు కలిగి ఒకదాని మనుగడను వేరొకటి సహించలేవని తెలుస్తుంది ప్రాథమికంగా.

కళ-తాత్త్వికత అను అంశముల మధ్య ప్రభేదం ఉన్నది. అందుకు కారణం – ఒకటి రసతత్త్వానికి అనుభూతికి ఆనందమునకు సంబంధించినదీ, వేరొకటి జిజ్ఞాసకు ఆలోచనకు అన్వేషణకు సంబంధించినదీ అగుట వలన ఈ వైరుధ్యం కనిపిస్తుంది సహజంగా.

ఇటువంటి స్వభావాలు కలిగిన ఈ రెండూ ఒకదాని మనుగడను గురించి వేరొకటి తెలుసుకొని ఉన్నా ; అది సామన్మాత్రంగానే తప్ప, అనుభూతం చేసుకొని అర్థం జేసుకొను స్థితిలో లేవు.

కళాశీలి, తాత్త్వికుడూ సృజనలో, విషయ పరిశోధనలో ఒక విషయానికి కట్టుబడినప్పుడు, అది దీప్తివంతంగా ప్రతిభావంతంగా ఉంటుంది. ఆ విధంగా కాక, ఒక వ్యక్తికి ఒకటికన్నా ఎక్కువ విషయాలు ఉన్నప్పుడు ప్రతిభ వివిధ విషయాలలో పల్చగా ప్రవహింప వచ్చును. అందువలన కళా, తాత్త్విక జగత్తుల సహజీవనం దుర్లభంగా భ్రమగా తోచవచ్చును ప్రాథమికంగా.

కళా తాత్త్విక జగత్తులకు ప్రభేదము ఉన్ననూ, కళాశీలి, దార్శనికుడూ వారి గమనంలో ఎదురగు మలుపుల వలన, కళనుంచి దార్శనికతకూ, దార్శనికతనుండి కళ వైపుకు పయనించడం జరుగుతుంది. అటువంటి మార్పు తమ సృజనాత్మక ప్రతిభలను గూడా కోల్పోవకుండా జరుగుతుంది ఒకోసారి.

ఒక విషయంలో, ఒక కళలో, ఒక తాత్త్విక పరిధిలో ఉన్న వ్యక్తి, తన స్వీయ వ్యక్తిత్వము (విషయానికి సంబంధించినది) కోల్పోకుండా ఇంకొక విషయము (Subject) ను దగ్గరగా తీసుకొని పరిశీలన జేస్తున్నప్పుడు అదిగూడా అభిమాన విషయమై, అందలి మాధుర్యమునకు, వాస్తవికతకు అతనికి తెలియకుండానే లొంగిపోవుట జరుగుతుంది. "అందువలననే కళాశీలిగాని, తాత్త్వికుడుగానీ, ఒక విషయము నుంచి, యింకొక విషయంలోకి తన జిజ్ఞాసను ప్రవహింపచేయటం జరుగుతుంది వాస్తవంగా !

ముంగర జాషువ

కాబట్టి, కళాశీలి, తన సృజననుంచి వేరు కాకుండా, తాత్త్విక అన్వేషణ సాగించుటయు, తాత్త్వికుడు తన జిజ్ఞాసను వీడకుండా కళాసృజన సాగించుటయు కనిపిస్తున్నది. కనుక విరుద్ధ స్వభావాలు కలిగిన ఈ రెంటినీ సహజీవనంలో కళ–తాత్త్విక జగత్తులు అనుట సమంజసమూ – సహేతుకమూ ! కళాకారుని, తాత్త్వికుని యొక్క లక్షణాలు ఈ క్రింది విధంగా ఉంటాయి స్థూలంగా !

అసలు సిసలైన అనుభూతిమయమైన కళాకారుని సౌందర్యతత్త్వం ప్రకృతి రామణీయతను హత్తుకొని ఉంటుంటే తాత్త్వికుని సత్యాన్వేషణ విశ్వంలోని యదార్థతను ముద్దాడుతూ ఉంటుంది. ఒకటి పరవశించి ప్రతిధ్వనించేది ఔతుంటే వేరొకటి విశ్వము యొక్క జీవనం యొక్క వాస్తవాన్ని తెలుసుకొని ధ్వనింపజేయు

నది ఔతున్నది. కళాశిలి సాగించే కళాసృజన మౌనంగా తన్మయతలొ ద్రవీకరణతో లలితమైన రసాభివ్యక్తితో జనిస్తుంది. దార్శనికుడు గ్రహించే వాస్తవ సత్యాలు పదునైన మేధతో, సమ్యగ్ దృష్టితో యదార్థ పరిశీలనతో పుడ్తుంటాయి.

ఒకటి రసాత్మకము – వేరొకటి ఆలోచనాత్మకము ఔతున్నవి. అటువంటి స్థితిలో ఈ రెండు అంశములూ అర్థమగుటకు స్వీయ స్వభావ ప్రభావం నుండి విడివడిన దృష్టితో పరిశీలించినప్పుడు ఆవలయున్న విషయం గ్రహింపుకు వచ్చుటకు అవకాశం గలదు. అప్పుడు సౌందర్య తత్త్వానికీ, సత్యాన్వేషణకు అంకితమైన ఈ విరుద్ధ స్వభావాలు తమ మనుగడను సాగిస్తూ ఒకరిలోనే సహజీవనం చేయటం తటస్థమౌతుందిగూడా ఒకోసారి! అందువలన కళా – తాత్త్విక జగత్తులు అనునవి సహజీవనం చేయుటలో వాటి సృజనకు అవరోధం కలిగించు అంశాలు ప్రోత్సహించే విషయాలు ఏమైనా ఉన్నాయా? అని పరిశీలించవలసి యున్నది.

కళాసృజనలో బలమైన సంవేదనలు, బరువైన అనుభూతులు, రమణీయ భావాలు, మధురంగా వ్యక్తం గావటము జరుగుతుంది. ఆ విధంగా తాత్త్విక ప్రతిపాదనలో బలమైన సంవేదనలు సున్నితమైన ఆలోచనలు చోటుచేసుకొని యథార్థత వెల్లడి ఔతుంది.

కనుక కళాసృజనలో సంవేదనలు, మధురంగా తియ్యగా ఉంటే, తాత్త్వికతలో సంవేదనలు వాస్తవంగా, కఠినంగా విచక్షణను కలిగిఉంటాయి. కాబట్టి కళాసృజనలోని ద్రవీకరణ తత్త్వశాస్త్ర పరిధిలోకి వచ్చినప్పుడు అన్వేషణలో అది ప్రవేశించి కొంత ఆర్ద్రస్వభావాన్ని యివ్వటం జరుగుతుంది. తరువాత తాత్త్వికుని ఆలోచనామయమైన విచక్షణ కళాసృజనలోకి ప్రవేశించి రసమయ సంవేదనకు కఠినత్వం చేకూరటమూ జరుగుతుంది.

అందువలన కళ లలితమైన దృక్పథాన్ని వీడటమూ, తాత్త్వికత ద్రవీకరణమయం కావటమూ, రెండిటి సృజనలోనూ జరిగి అవరోధాలు ఏర్పడవచ్చును ప్రాథమికంగా. కళావేత్తలు వారికి తాత్త్విక పరిశీలన ఏర్పడుతున్నప్పటికీ కళాతత్త్వంనుండి వేరుగాక తాత్త్విక ఆలోచనల నుండి దూరమై కళాపరిధిలో జీవిస్తారు.

ఆ విధంగా జీవించలేనివారు తమ కళాసృష్టిలోనే తాత్త్విక భావాలను చొప్పించవలెనని ప్రయత్నిస్తారు. అప్పుడు కళాసృజన తాత్త్విక ధోరణిలో సాగి భావంలో బరువైన వాతావరణంలో యుండి రసాస్వాదికి ఇబ్బంది కలిగిస్తుంది. అదేవిధంగా తాత్త్వికులకు కళాభిరుచి కలిగినప్పుడు కళాతత్త్వం తమలోని వాస్తవ దృక్పథాన్ని చెరిపివేస్తుందని రసతత్త్వం నిరర్థకమని, ప్రలోభమయమైందని, తాత్త్విక పరిశీలనను అంటిపెట్టుకొని కళాపరిధి వైపు తలుపులు మూసివేస్తారు. ఆ స్థితిలో కళాతత్త్వం కొంచెమొ గొప్పొ తాత్త్వికుని సృజనలో వ్యక్తమౌతునే ఉంటుంది సుందరంగా! అప్పుడు వాస్తవ దృక్పథంతో చెప్పే విషయాలు ఏదో సుగంధాన్ని ఒంటికి పూసుకొని వ్యక్తమౌతుంటాయి. అప్పుడు చదివే పాఠకునికి ఈ సౌందర్య తత్త్వం ఇబ్బందినీ, వెగటునీ కలిగిస్తుంది.

అయితే కళ.తత్త్వశాస్త్రమూ అనునవి ఉదాత్త విషయాలు. అవి ఒక వ్యక్తిలో సహజీవనం చేస్తున్నప్పుడు అవి వ్యక్తి యొక్క సృజనాత్మక ప్రతిభకు అవరోధంగా నిలుస్తాయని భావించటమూ సహేతుకంగాదు.

ఈ రెండు విషయాలను వాటి నిర్మాణతలో ఒకదాని పరిధిలోకి వేరొకటి రాకుండా నిరోధించటమూ అవసరము. ఆ విధంగానే ఒక విషయ సహాయంతో రెండవ విషయాన్ని విశ్లేషించి వాటిలోని Merits ని Demerits ని చూడటం జరిగినప్పుడు కళా-తాత్త్విక విషయాలలో జీవనానికి సంబంధించినవి సులభంగా సుబోధకం ఔతాయి. కళా-తాత్త్విక జగత్తులు పరస్పరాశ్రితాలు కావు. కాని అవి రెండూ ఒక వ్యక్తిలో జీవించినప్పుడు పరస్పరాశ్రితాలు ఔతాయి కాబట్టి కళా-తాత్త్విక జగత్తుల సహజీవనం సాధ్యమేనని చెప్పవచ్చును నిస్సందేహంగా. కనుక కళాదార్శనిక విషయాలతో సహజీవనం చేస్తున్న

( తరువాయి 50వ పేజీలో )

# శ్రీ మాధవస్వామివారు

కృష్ణాజిల్లా ముఖ్య పట్టణమైన మచిలీపట్నంకు 7 కిలోమీటర్ల దూరములో వున్న గూడూరు గ్రామములో శ్రీ మాధవస్వామివారి దేవాలయము కలదు. ఇది పంచ మాధవ క్షేత్రములలో ఒకటిగా వాడుకలో గలదు.

శ్రీదేవి, భూదేవేరులతో శ్రీ స్వామివారు వేంచేసి యున్న గూడూరు గ్రామము పూర్వము 'గుండూరు' నామముతో పరగణాకూడలి గ్రామమై వుండెడిది. 1‾ వ శతాబ్ద ప్రారంభములో మహమ్మదీయ పరిపాలన కింద వున్న సూచనలు గలవు. ఆ కాలములో శ్రీ స్వామివారి ఆలయము యిప్పుడు ప్రభుత్వ ఒడంబడికలో కదిలించ కూడని మసీదు స్థానములో వుండెడివి. మహమ్మదీయ తిరుగుబాటుల సమయములో దేవాలయమును శిధిలము గావించి విగ్రహములను పారవేయగా ఇప్పటి ధర్మకర్త శ్రీ కలపటపు రామకృష్ణారావు పూర్వీకులకు ఆ విగ్రహములు "మండే చెఱువు" నందు దొరకగా ప్రస్తుతము దేవాలయము వున్న తావునందు పునః ప్రతిష్ఠ చేసిరి

కలపటపు రామకృష్ణారావుగారి తాతగారి ముత్తాత అయిన లక్ష్మీపతిగారు శ్రీ స్వామివారిని ప్రతిష్ఠ చేసి ఆలయము కట్టించగా వారి కుమారుడు కృష్ణయ్యగారు 1852 సం॥ లో దేవాలయ పోషణను అనువంశీకముగా వారి వంశీయులే పరిపాలించబడే లాగున భూములు వ్రాసి యిచ్చిరి. కృష్ణయ్యగారి కుమారుడు సీతారామయ్యగారి హయాంలో 75 అడుగుల ఎత్తుగల అయిదు అంతస్తుల రాజగోపురము, 16 స్తంభముల కళ్యాణ మంటపము నిర్మాణము పూర్తి చేసిరి. సీతారామయ్యగారి మనుమడు కృష్ణారావుగారు శ్రీ స్వామివారి ఎదురుగా, ధ్వజస్తంభము వద్ద గల శ్రీ దాసాంజనేయస్వామివారి ఆలయము వరకు ముఖ మండప నిర్మాణము గావించిరి.

శ్రీ స్వామివారి ప్రతిష్ఠ జరిగిన నాటినుండి శ్రీ స్వామివారికి క్రమము తప్పకుండా విఖనస సూత్ర ప్రకారము త్రికాలార్చన, నిత్య దీప, ధూప నైవేద్యములు, నిత్య శ్రీఖండము జరుగుచున్నవి. 2-10-191- తేదిన ప్రస్తుత ధర్మకర్తగారి తాతగారు మరణించగా ఆ రోజున ఇంక ఎవరి గోత్రనామములతో అర్చన చేయాలో పాలుపోక అప్పటి అర్చకస్వామి ధ్వజస్తంభమునకు తల కొట్టుకొనుచుండగా అప్పుడే మగపిల్లవాడు పుట్టినట్లు వర్తమానం చేరి "కృష్ణారావు" పేరుతో అర్చన చేసిరి. ఒక్క రోజు కూడా ఆ స్వామివారి సేవకు ఆటంకము రాకుండా జరిగెను.

## కలపటపు రామకృష్ణారావు

1964 లో కళ్యాణోత్సవముల సమయములో సరదా కొరకు గాలిగోపురము పైకెక్కిన శ్రీ వి.యస్. నారాయణమూర్తి పైనుండి పట్టుతప్పి పందిరిపైబడి, పందిరి వాసము విరిగి పందిరిలో నుండి నేలపైబడెను. 75 అడుగుల ఎత్తుపైనుండి పడినను చిటికెన వ్రేలు కూడా విరుగక పోవుట శ్రీ స్వామివారు చక్రము అడ్డము వేసి కాపాడినట్లుగా గ్రామస్తులంతా శ్రీ స్వామివారి మహత్యంగా భావిస్తారు. అలా శ్రీ స్వామివారి కృపకు పాత్రులైన శ్రీ వి. యస్. నారాయణమూర్తి ప్రస్తుతము ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ గా వుంటున్నారు.

సంవత్సరాది లగాయతూ, సంక్రాంతి వరకు అన్ని పండుగులకు శ్రీ స్వామి వారికి ప్రత్యేక సేవలు, ధనుర్మాసము నెలరోజులు ప్రభాతసేవ, శ్రీకృష్ణాష్టమి,

విజయదశమి, వైకుంఠ ఏకాదశులందు గ్రామ సేవలు జరుపబడుచున్నవి. ప్రతి ఏటా వైశాఖ పౌర్ణమికి బ్రహ్మోత్సవము వైభవముగా జరుపబడుచూ యీ వుత్సవములు యీ ప్రాంతమందు ఒక ప్రత్యేకత సంతరించుకున్నవి.

1951 సం॥లో కలపటపు కృష్ణారావుగారు వేదములు, ఉపనిషత్తులు పురాణ గ్రంథములు అనేకము సేకరించి " శ్రీ మాధవ గ్రంథాలయము " స్థాపించిరి. వేదాంత, వైదిక, ఇతిహాస పురాణములు, స్తోత్రములు, కావ్యములు షుమారు 600 పుస్తకములుగల యీ గ్రంథాలయము ఇచ్చటకు సమీపములోని చిట్టిగూడూరు కళాశాల విద్యార్థులకు విషయ సేకరణకు ఎంతగానో తోడ్పడుచున్నది.

శ్రీ స్వామివారి భక్తులు శ్రీమాన్ దీవి లక్ష్మీ నృసింహాచార్యులుగారు "శ్రీ మాధవాష్టకమ్" రచించగా దానిని శిలాఫలకముపై చెక్కించి 1983 లో ముఖ మండపమునందు ఆవిష్కరించడమైనది.

75 అడుగుల ఎత్తుగల రాజగోపురమునకు లక్షన్నర రూపాయల వ్యయముతో సిమెంటు ప్లాస్టరింగు పనిని యీ సంవత్సరం చేపట్టడం జరుగుతోంది.

ఈ సంవత్సరము శ్రీ స్వామివారి కల్యాణోత్సవములు మే 19వ తేదినుండి 25వ తేది వరకు వైభవముగా జరిగినవి. " నమ్మి చెడినవారు లేరు నమ్మక చెడిపోదురేమో" నవే నానుడి ననుసరించి భక్తులందరూ శ్రీ స్వామివారిని సందర్శించి తరించగలరు. 

# ధృతరాష్ట్రుని రాజనీతి

**భారతం** కవులకు కావ్యం ? ఐతిహాసికులకు ఇతిహాసం ; రాజనీతివేత్తలకు రాజకీయ శాస్త్రం కూడా ! ఇందులోని రాజనీతి పైకి చూడగా అన్నిచోట్ల ఒకేలాగ కనబడుతుంది. కాని ఆలోచించగా, కొందరు రాజులు – శ్రీరాముని వంటివారు – ధర్మాన్ని ఆచరించడానికే రాజ్యాన్ని చేస్తారు. వారు మన్నించే రాజనీతి ఒకవిధంగా ఉంటుంది మరికొందరు అర్థాన్ని అభిలషిస్తారు. అందులో కొందరికి అర్థసంగ్రహణమే ప్రధానం, మరి కొందరికి రాజ్యవిస్తరణమే ముఖ్యమైనది వీళ్ళకు కావలసిన రాజనీతి వేరుగా ఉంటుంది. మరొక రాజు కేవలం భోగలాలసుడు. అతనికి కావలసిన రాజనీతి కామ పరతంత్రుడవడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. మరికొందరు మోక్షార్థులై ఉంటారు, జనకుని వంటివారు. వారి కవసరమైన రాజనీతి వేరు !

ఈ నీతులను చెప్పేవారు భారతంలో అనేకమంది కనబడతారు. యయాతి పుత్రునకు నీతులను బోధించాడు. కణికుడు దుర్యోధనునకు రాజనీతిని బోధించాడు. నారదుడు సభాపర్వంలో ధర్మరాజును కొన్ని రాజనీతి విషయాలను అడుగుతూనే, పరోక్షంగా రాజనీతిని విశదీకరించాడు. ఆ మీద ధృతరాష్ట్రుడూ విదుర నీతులను విన్నాడు. ధర్మరాజునకెందరో ఎన్నో విషయాలను బోధించారు.

అయినా తనివిలేదు. ఎవరెన్ని చెప్పినా, ఇంకా పరిశేషం ఏమయినా ఉన్నదేమోననే ధర్మరాజు అనుమానం. అందుకే వనవాసానికి వెళ్ళేముందు ధృతరాష్ట్రుడు కొన్ని రాజనీతుల నుపదేశింప బూనుకుంటే, ధర్మరాజు శ్రద్ధాళువై విన నారంభించాడు.

అయితే ఏ యిద్దరు రాజనీతులను చెప్పినా, ఆ నీతులు ఆయా వ్యక్తుల మానసిక తత్వాన్ని ఆవిష్కరిస్తాయి. ఆయా వ్యక్తుల పూర్వానుభవాన్ని అనుసరించి ఉంటాయి. శ్రోతయొక్క అభిరుచిని అనుసరించి, అవసరాన్ని అనుసరించి, నీతులు వివరింపబడుతాయి.

ఇక్కడ ధృతరాష్ట్రుడు చెప్పిన నీతులు ఒక వంక రాజునకు ఆత్మరక్షణకు ఉపయోగపడతాయి. మరొక వంక శత్రురాజ్యాలను జయించడానికి ఉపయోగిస్తాయి.

పడలి మందేశ్వరరావు

పుర రక్షణాన్ని దృఢంగా చేసుకోవాలి ; నమ్మదగిన సత్పురుషులనే భోజన నిద్రాది క్రియలకు సాయపడేటట్లు ఏర్పరచుకోవాలి. క్రొత్త వేమయినా పుడుతే, అశ్రద్ధ పనికిరాదు, వెంటనే విచారించాలి. రాజ్యానికి అపకారులైన వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించాలి. రాజుయందు భక్తి స్నేహావేశముగల శూరుణ్ణి సైన్యాధికారిగా చేయాలి. మనలోని దోషాలను ఎవ్వరికీ తెలియనీయక గోప్యంగా ఉంచుకోవాలి ; ఇతరుల దోషాలను మాత్రం శ్రద్ధగా గమనించాలి. వైమనస్యం ఏర్పడ్డ మంత్రులుగల శత్రురాజ్యాలను ఆక్రమించాలి.

ఇలా ఉన్నాయి ధృతరాష్ట్రుని నీతులు. అంటే అతని నీతులన్నీ ప్రధానంగా ఆత్మరక్షణ కోసం, రాజ్య విస్తరణకూ ఉపయోగపడేవన్నమాట. జాగ్రత్తగా ఆలోచిస్తే, ఈ నీతులు ధర్మరాజుకు ఉపయోగపడడం కన్న ధృతరాష్ట్రుని మనస్తత్వాన్ని ఎరుకపరచే వానిలా ఉన్నాయి. ఎన్ని చెప్పినా, ధృతరాష్ట్రునికి లోభగుణం

పూర్తిగా నశించలేదు. తన కొడుకుకు రాజ్యం దక్కాలి. అప్పుడది సాధ్యం కాలేదు. ఇప్పుడు తనకు కావలసిన వాళ్ళు తమ్ముని కొడుకులు. అందుచేత వాళ్ళ రాజ్యమైనా సుస్థిరంగా ఉండాలి, వాళ్ళ రాజ్యమైనా విస్తరించాలి. అదీ ధృతరాష్ట్రుని నీతికి మూలకందంగా ఉన్న భావం.

అయినా ఒక గొప్పమాట మాత్రం ధృతరాష్ట్రుడన్నాడు. ధర్మమార్గాన ప్రజలను పాలించడం అశ్వమేధాది అనేక క్రతువులను చేయడంకంటె అధికమేసయ్యా! అన్నాడు. అంతకు పూర్వమే ధర్మరాజు అశ్వమేధ యాగం చేశాడన్న విషయాన్ని జ్ఞాపకముంచుకుంటే, యీ హెచ్చరికలోని ఔచిత్యం విశదమవుతుంది.

అది అలా ఉండగా, ధృతరాష్ట్రుని యీ చివరి మాటలు పరిపాలనా దక్షతకు మూలకందంగా ఉండవలసిన ధర్మనిష్ఠను ఆవిష్కరిస్తున్నాయి. వస్తుతః అతడు రాజ్యపాలనలో గొప్ప సంప్రదాయాన్ని సృష్టించిన కురువంశ రాజుల శ్రేణిలోనివాడు. అతని నోట ఈ మాట రావడం ఆశ్చర్యం కాదు. కాని ధర్మరాజున కాతడు చేసిన హెచ్చరిక ఎంతో అవసరం. తపోవనాల వైపునకు మళ్ళే ధర్మరాజు చూపును, రాజ్యపాలన వైపు మళ్ళించడానికీ హితవు ఎంతో అవసరం.

ధర్మజున కిలా నీతులను ఉపదేశించి, ధృతరాష్ట్రుడు అభ్యంతర గృహానికి వెళ్ళాడు ; సుఖాసీనుడయాడు. వనవాసానికి సన్నద్ధుడయే ఉన్నాడు కాని – మరొక్క పని మిగిలి పోయిందన్నాడు, వృద్ధ రాజు.





## సంస్కృతి

"మానవ శాస్త్రము (ANTHROPOLOGY)లో మనిషి ప్రయత్నం వల్ల అతని జీవితంలో కలిగే మార్పుల తీరు తెన్నులను CULTURE అందుము. CULTURE అనే పదాన్ని మనం సంస్కృతి అంటున్నాము. సమానార్థకమే అయినా, మన సాంప్రదాయంలో సంస్కృతికి విశేషమైన అర్థం వున్నది. తాత్విక దృష్టితో పరిశీలించవలసిన అంశమిది. మనిషి మానవుడుగా రూపొందడం సంస్కృతి. పాశవిక దశనుంచి ఎదిగి, సహజాతంగా సంక్రమించిన పశు లక్షణాలను నిగ్రహించుకొని, అదుపులో పెట్టుకొని, సాంఘికాభ్యుదయం కోసం వ్యక్తిత్వాన్ని మలచుకోవడం సంస్కృతి."

– ఇరివెంటి కృష్ణమూర్తి



# ఉలవలు
(HORSE-GRAM)

# వైద్యవాణి

ఎస్. ఎన్. దుర్గారావు

ఉలవలలో మూడు రకములు కలవు. తెలుపు, ఎరుపు, నలుపు అని. ఈ మూడింటిలో మిక్కిలి శ్రేష్ఠమైనవి నల్ల ఉలవలు.

వీటి గుణములు పరిశీలించిన, వగరు తీపి రుచి, కలిగి యుండునని తెలియవచ్చును. కఫ వాతములు శమింప చేయును. విదాహము, మలబద్ధము కలిగించును. శరీరమునందలి నీటిని ఆర్చును. స్త్రీలకు ఋతు రక్తమును జారీ చేయును. ప్రసవస్త్రీల మైల రక్తమును కూడా వెలువరించును. అధికముగా తినిన రక్త పిత్త వ్యాధి కలుగునని 'వస్తుగుణ ప్రకాశిక' లో చెప్పబడితే, అడవి ఉలవలకు మాత్రమే ఇటువంటి గుణం కలదని 'సుశ్రుతము' లో చెప్పబడియున్నది.

ఉలవలను ఉడకపెట్టి తినినను లేదా ఏవిధముగా సేవించినను వాటి స్వాభావిక గుణములు ఏమాత్రం తగ్గవు. ఉలవ కట్టు వాతమును అధోముఖమున హరించుటలో మిక్కిలి ప్రశస్తమైనది. నల్ల ఉలవ కట్టు స్థూలత్వమును తగ్గించుటలో ఉపయోగకారి.

మానవులకే కాక ముఖ్యముగా ఇవి పశువులకు కూడా అవసరము. పశువుల దొమ్మ రోగమునకు నల్ల ఉలవలను కాచిన నీళ్ళను పెట్టెదరు. ఉడకబెట్టి పెట్టిన నిస్సత్తువ తగ్గి వెంటనే వాటికి బలము కలుగును. ఉలవలు నాన వేసి మెత్తగా రుబ్బి పాడి పశువులచే తినిపించిన పాలు బాగా ఇచ్చును. పశువులకు తగిలిన దెబ్బలకు ఉలవ నీళ్ళతో ఎర్ర మట్టి కలిపి పట్టు వేయుదురు. ఉలవబొత్తు కూడా పశువులచే తినిపించిన పాలు ఎక్కువగా లభించును.

వైద్య విశేషాలను పరిశీలించుదాం. ఉలవ అప్పడములు నూనెలో వేయించి పెరుగుతో భుజించిన అన్న ద్రవశూల నివర్తించును; వేయించిన ఉలవలను చూర్ణముగా చేసి తినిన జ్వర సమయంలో విస్తారముగా పట్టెడు చమటను అదుపుచేయును; ఉలవ కషాయంలో నిమ్మకాయ పిండి, కొంచెం ఉప్పు, మిరియముల పొడి కలిపి త్రాగిన వాత శూలలు హరించును; ఉలవల చారు సేవించిన గర్భవాతము హరించును.

ఈ ఉలవలు వేడిచేయునని, వీర్యమును నశింపచేయునని చరకుడు తన గ్రంథము (చరకము) లో వ్రాసియున్నాడు. భావ ప్రకాశకకారుడు, ఇవి కృమి హరము, మేదోహరము అని వ్రాసియున్నాడు.



ఆమె కన్నీళ్ళు తుడుచుకుంది.

“ డాక్టరుగారూ – నా శక్త్యానుసారం తృణమో పణమో కూడా సమర్పించుకుంటాను. ”

“ అలాగే అమ్మా - నేను మాత్రం కాదంటానా. ఇదుగో ఇందాకనే బంజారాహిల్స్ నుంచి ఫోను వచ్చింది.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

సరిగ్గా నీలాంటి కేసే. అర్జంటు, అవతల ఆ పిల్లకు పెళ్ళి ముహూర్తం దగ్గరకొచ్చింది. ఇటు కడుపులో శిశువు పెరుగుతున్నది. ఏమిటి చేయడం ? వెయ్యి తీసుకుని రేపే రమ్మన్నాను. ఎలా మరి సమాజంలో సభ్యతకూ గౌరవానికీ భంగం రాకూడదు మరి. డాక్టరంటే కేవలం మందిచ్చేవాడే కాదు, మానాభిమానాలను కూడా రక్షించగలగాలి – ఏమంటావమ్మా. ”

“ డాక్టరుగారు .... నేను పెద్ద ఉన్నదాన్ని కాదు. అసలు మీ దగ్గరికి రాగల శక్తి సాహసమూ లేక ఏవో మందులూ మాకులూ మింగాను – విఫలమైనాయి. గతిలేక వచ్చాను. కన్నతండ్రిలా అభయమిచ్చారు, నన్ను కడతేర్చే భారం మీదే. ”

“ అలాగేనమ్మా వెయ్యి లేకుంటే ఎనిమిది వందలు నీ శక్త్యనుసారం తీసుకురా. ”

“ అన్యథా భావించకండి. ఓ రెండువంద లిచ్చుకుంటాను. అంతకుమించి శక్తిలేదు. మీవి చేతులు కాదు కాళ్ళనుకోండి ” డాక్టరు రాజు రెండు చేతులకూ నమస్కరించింది.

డాక్టర్ రాజు ముఖంలోని రంగులు ఇంద్రధనుస్సులోని వర్ణాల్లా మారాయి.

“ పెట్రోలు పోయించుకొచ్చాను సార్ ”, శ్యామ అయ్యంగార్ వచ్చాడు.

“ ఇప్పుడే వస్తాను ” అని రాజు లేచి మెట్లు దిగాడు.

కారు కదిలిన శబ్దం–

“ చూడండమ్మా, మీరు ఫీజు తీసుకొని వచ్చినట్లు లేదు ”

తెల్లముఖం వేసుకుని ఆమె చూస్తున్నది.

“ అందుకే డాక్టరుగారు వెళ్ళిపోయారు ”

“ అదేమిటి, మళ్ళీ రారా ”

“ చెప్పలేము, రావచ్చు, రాకపోవచ్చు. వేరే కేసుల కోసం వెళ్ళారు. పేషెంటునిలా కూర్చోబెట్టి వెళ్ళడం ఇదే మొదలు. ఏం తల్లీ, ఏదో నాలుగొందలలో ఐదు వందలలో ఇస్తామన్నారేమిటి ”

ఆమె అవమానంతో కుంచించుకు పోతున్నది.

" అవ్వే, కాంచనం కర్మమోచనం అన్నారు పెద్దలు. చేసినపాపం కడుక్కోడానికన్నా వెయ్యి రూపాయలవసరం. వెయ్యికి తక్కువైతే అసలు మా డాక్టరుగారు కేసే ముట్టరు. చూడమ్మా, డబ్బు తీసుకొని గుట్టుచప్పుడు కాకుండా రేపు రండి, వెళ్ళండి ".

" బాబూ, అంత ఇచ్చుకోలేను నేను. "

" ఇదేమిటమ్మా, కూరగాయల బేరమనుకున్నావా ? ఎవరికైనా తెలిస్తే ఎంత ప్రమాదం, ఎంత నేరం ? ఎంత అవమానం ? రెండో కంటివాడికి తెలియకుండా మీ జీవన రహస్యాలన్నీ శివుడు గొంతులో విషాన్ని దాచుకొన్నట్లు దాచుకొనే డాక్టరుగారికి మీరిచ్చే ప్రతిఫలం ఏమిటి ? ఇదేనా .... "

" నిజమే బాబూ. కాని నేను ధనికురాలిని కాదు. "

శ్యామయ్యంగార్ కోపంతో మండిపడ్డాడు.

" డబ్బు లేకపోతే పనులు చేయడానికి ఇదేమీ అనాథ శరణాలయం కాదు. ఇక్కడికి అంతా క్లాస్ పీపిల్ వస్తారు. అంతా పెద్దపెద్ద వాళ్ళు. అందరూ కార్ల మీదనే వచ్చి ఎబార్షన్ చేయించుకుపోతారు. నడుచుకుంటూ నీవు వచ్చినప్పుడే అనుకొన్నాను. సరే, దానికేం పోవమ్మా పో ఆసల్యమైతే నీ బతుకుకే ప్రమాదం. పైగా ఒట్టి మనిషివి కూడా కాదు. క్షణ క్షణానికీ నీ గర్భస్థ శిశువు పెరుగుతూ వుంటుంది. అవ్వ !! ఎంత అవమానం. "

ఆమె భోరుమని ఏడ్చింది.

" ఏడ్వకమ్మా, ఏడిస్తే ప్రయోజనంలేదు — చేతులు కాలాయి. ఆకులు పట్టుకోవద్దు. డబ్బు తీసుకుని రేపు రావాలు. "

" కాని - అంత మొత్తం ఏలా తీసుకురాను ? "

" ఎలాగన్నా తీసుకురా, నీ మానం తాకట్టు పెట్టి తీసుకురా. ఎలా తెస్తావో మా కనవసరం. "

ఆమెలోని స్త్రీత్వం పడగవిప్పింది.

( జ రి గి న క థ )

డాక్టర్ రాజును వెతుక్కుంటూ వచ్చే చాలామంది మాదిరే ఆ రోజు ఆమెకు డాక్టరు ఇల్లు చూపించి తన పనిలో తిరిగి నిమగ్నమయ్యాడు మేదరి చంద్రయ్య. డాక్టర్ రాజు ఆమెను వివరాలు చెప్పమంటే సంకోచించింది. సరే, కాగితం మీద రాసి వ్వమన్నాడు కేసు హిస్టరీ. రాసిచ్చిందామె.

( ఇ క చ ద వ ం డి )

టేబిల్ మీదవున్న ఐస్క్రీం విసిరి శ్యామ అయ్యంగార్ ముఖానికేసి కొట్టింది. "బద్మాష్ ఏమన్నావ్". కోపంలో ఆమె ఆడ సివంగిలా వణికిపోతున్నది. "తెలియక చేసిన పాపానికే కన్నీరు మున్నీరై ఏడుస్తుంటే నన్ను మాట లతో రెచ్చకొడతావురా. "

శ్యామ అయ్యంగార్ అయిస్క్రీమ్‌ను నాప్‌కిన్ పెట్టి తుడుచుకున్నాడు. ఏమీ ఉద్రిక్త పడలేదు. చాలా మెల్లగా ఒక్కొక్కమాటా అన్నాడు.

" నీవేమీ పతివ్రతవు కావు. నిన్న ఒకడితో చేసిన పొరపాటే రేపు మరొకడితో చేస్తే అలవాటవుతుంది. ఏమమ్మా నువ్వు నా వంటి సంస్కారవంతుడితో అనకూడని మాటలన్నీ అనిపిస్తున్నావు. ఛీ ! ఛీ ! ఈ సమాజాని కసలే బుద్ధిలేదు. మనిషిని పశువులాగా మారుస్తుంది. " శ్యామ అయ్యంగార్ కణతలు రెండూ పట్టుకుని కూర్చొన్నాడు.

ఎవరు మనిషో ఎవరు పశువులా మారారో ఆమెకు అర్థంకాలేదు. శ్యాం కావాలనే అసభ్య పదాలు ప్రయోగించి తన్ను రెచ్చగొడుతున్నాడు. ఉద్రిక్త పరుస్తున్నాడు. శిఖరాగ్రస్థాయికి తీసుకొనిపోయి వెయ్యి రూపాయలూ పిండుకునే మార్గం ఆలోచిస్తున్నాడు.

" అంత ఇచ్చుకోలేనిదానివైతే నారాయణగూడాలో రోడ్డుపక్క కోయవాళ్ళు మూలికలు అమ్ముతారు. పది పైసల కొకటి, పావలాకొకటీ. ఓ రెండు కొనుక్కొని మింగు. నీ మొఖం చూస్తే అదీ చేసినట్లే కనపడుతున్నది. మరింకేమి పోయి పైసలు పట్టుకురా "

ఆమె కన్నీళ్ళు తుడుచుకొని లేచింది.

" వెళ్ళిరావమ్మా, రేపు ఎన్నింటికి వస్తావో టైం ఇచ్చి పో. లేకుంటే మళ్ళీ వేరే వెళ్ళవచ్చు మేము ఎక్కడికైనా "

" రాను మళ్ళీ రానే రాను "

శ్యాం విచిత్రంగా నవ్వాడు. " రాక ఎక్కడికి పోతావమ్మా, పరుగెత్తుకుంటూ వస్తావు నువ్వు "

" ఏం అంత ధీమాగా చెపుతున్నావు మళ్ళీ వస్తానని "

" నీవు వ్రాసిన ఉత్తరమే చెపుతున్నది. నోటి మాటలు కూడా కాదు. స్వదస్తూరీతో నీ కళంకితమైన చరిత్రనంతా కాగితం పైకి ఎక్కించావు కూడాను "

ఆమె పాతాళలోకానికి క్రుంగిపోతున్నది.

అనుక్షణం విధి తనచేత తప్పిదాన్ని మించిన తప్పి దాన్ని ఎలా చేయిస్తున్నదో అర్థమైంది.

ఒక తప్పునుంచి తప్పించుకొనేందుకు మరొక విష వలయంలో ప్రవేశిస్తున్నది తను.

అయ్యంగార్ నవ్వాడు. ఆ నవ్వులో విషం చిద్రుపలు చిద్రుపలై పడుతున్నది. " ఒక్కసారి నీ భవిష్యత్తు ఊహించుకో. అటు కారు చీకటి, ఇటు పున్నమి వెన్నెల. అటు సభ్య సమాజంలో తలెత్తుకోడానికి వీలులేని బ్రతుకు. ఇటు గౌరవంగా పరువు ప్రతిష్టలతో సంసారం నిలబెట్టు కునే మార్గం. పో ఆలోచించుకో. నీ కోసం నీవిచ్చే ముష్టిపైసల కోసం దేవుడిలాంటి మా డాక్టరుగారు శిశు హత్యకు సిద్ధమైనాడు. * ఆయన నింకా కించపరచకు. ఉప్పు, మిరపకాయ, చింతపండూ బేరమాడినట్లు మానవత్వాన్ని బేరమాడి అవమానించకు, వెళ్ళమ్మా, వెళ్ళు. "

* ఈ కథాకాలానికి గర్భస్రావం చట్టబద్ధం కాలేదు.

– రచయిత

ఆమె లేచి నిల్చున్నది.

బ్లాక్ మెయిల్ అయ్యంగార్ మళ్ళీ నవ్వాడు.

" నీ పరువు ప్రతిష్ఠలన్నీ ఇప్పుడు మా చేతుల్లో వున్నాయి. రాకపోయినావో ఖబడ్దార్. నేనసలే మంచి వాణ్ణి కాను. రేపు చూచి ఎల్లుండి నిన్ను బజారు కెక్కి స్తాను. పత్రికల కెక్కుతావు నువ్వు. " గోడపై హిపోక్రట్ నీతివాక్యాలు జాలిగా ఏడ్చాయి !!

అప్పుడామె విచిత్రంగా నవ్వింది.

జీవచ్ఛవంలా నవ్వింది.

నవ్వు అనే పదానికి అర్థంగా చెప్పదగ్గ ఏ పోలికాలేని ఓ విచిత్రమైన ముఖ భంగిమ చేసింది. దానికి మానవ నిర్మితమైన భాషలో పరిభాషలో ఇదమిత్థంగా ఒక అర్థ నిర్ణయం ఇంకా ఏ శబ్దకారుడూ చెయ్యలేదు.

అందుకనే ఆమె నవ్వింది అని అనవలసివస్తున్నది.

నవ్వి ఇలా అన్నది " కాంపౌండర్, ఎల్లుండి దాకా ఎందుకు రేపే ఎక్కుతాను పత్రికలకు. "

శ్యాం వికృతంగా నవ్వి అన్నాడు. "ఓఁ ఇలాంటి బెదిరింపులు చాలా చూశాము. పో పో అంత ప్రాణంమీద తీపి లేనిదానివేమీ కాదు. ప్రాణం విలువేమిటో మాకూ తెలుసు, నీకూ తెలుసు."

ఆమె మెట్లు దిగింది.

యాంత్రికంగా నడుచుకుంటూ బరకత్‌పురా రోడ్డు మీదికి వచ్చింది.

చంద్రయ్య తలెత్తి చూచాడు.

ఆమె కన్నుల్లోని మూగ వేదనను అర్థంచేసుకున్నాడా ?

ఏమో మరి !!

అయినా తనెవరు ? ఆమె ఎవరు ??

చంద్రయ్య బుట్టల దుకాణం ముందునుంచి నారాయణ గూడా వైపుకు నడుస్తున్నది.

ఓ రిక్షా ఎదురైంది.

" చల్‌తే మియ్యా " ( వస్తావా ? )

" హాఁ కహాతక్ ! " (ఎక్కడిదాకా అమ్మగారూ)

" టాంక్‌బండ్ "

ఆమె రిక్షా ఎక్కింది. రిక్షావాడు లిబర్టీ రోడ్డు మీదుగా రెండు ప్రాణాలను మోసుకుంటూ చీకటిని దూసుకుంటూ చీల్చుకుంటూ గంగపైపుకు ప్రయాణం చేశాడు.

* * *

" శ్యామూ - శ్యామూ " కళావతి తెచ్చి ఇచ్చిన బోర్నవిటా చప్పరిస్తూ కళ్ళజోడును ముక్కుపైకి లాగి ఆ సందులో నుండి చూస్తూ చేత్తో అప్పుడే వచ్చిన స్థానిక ఆంగ్ల దినపత్రిక పట్టుకొని కాంపౌండర్ని పిలిచాడు డాక్టర్ రాజు. కళావతి శ్రీ వెంకటేశ్వరుడికి ప్రభాతార్చన ముగించింది - శ్యామ అయ్యంగార్ భక్తిగా కళావతమ్మ గారి వద్ద నుండి తీర్థ ప్రసాదాలు తీసుకొని చేతిని తుడుచుకుంటూ హాల్లోకి వచ్చాడు - 'చూచావా శ్యామూ పేపర్'

" లేదు సార్ - ఏమిటి విశేషాలు"

" విశేషమే - ఈ ఫోటో చూడు రాత్రి మనదగ్గరికి వచ్చిన పేషెంటులాగే వుంది. "

శ్యాం అయ్యంగార్ చూచాడు.

" అవును సార్ - ఆమే - ఇదేమిటి - తెల్లవారే సరికి .... "

" శ్రీనివాస ! శ్రీనివాస " డాక్టర్ రాజు ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు.

" ఈశ్వరుడు ఎందుకిలాంటి పాపులను పుట్టిస్తాడో అర్థం కాదు - వ్యభిచారం చేసిన స్త్రీ భ్రూణహత్యకు సిద్ధపడది. శిశు హత్య సాధ్యపడక పోయేసరికి ఆత్మహత్యకు దిగింది. భ్రష్టస్యకావాగతిః అంటే అర్థం ఇదేనోయ్ శ్యామూ - ఒక పాపానికిఒడిగట్ట సాహసించిన వనితకు మరో మహా పాపం మంచినీళ్ళ తుల్యం - అయినా ఈశ్వరుడి లీలలేమిటో నాకు మటుకు అర్థం కావడం లేదు. "

" ఆమె రాత్రే అన్నదిసార్ - కాని ఇంతపని చేస్తుందని నేను అనుకోలేదు. "

' శ్రీనివాస - శ్రీనివాస '

" ఏం చేస్తాం. ఇదో మహా ప్రపంచం. అనుక్షణం వేలమంది చస్తుంటే లక్షలమంది పుడుతున్నారు - ప్రాణానికి విలువ లేకుండా పోయింది. లేకుంటే ఎంత సాహసం ఎంత సాహసం - అయినా మనమేం చేయగలం? ఇలాంటివాళ్ళు రోజూ ఎందరో - ఎక్కడో .... హుఁ "

శ్యామయ్యంగార్ నిట్టూర్చాడు.

" నేను వెయ్యి కొంచెం ఎక్కువ చెప్పానేమోనని అనుమానంగా వుంది. "

' అవునుసార్ నేనూ అదేఅనుకున్నాను - ఆవిడ ముఖం చూస్తే అంత ఇచ్చుకునేదిలా కన్పడలేదు. పక్క గదిలోనుండి నేను రింగప్ చేసి బంజారాహిల్సు నుంచి మాట్లాడినట్లు నటించినప్పుడే ఈ విషయం చెప్పాలనుకున్నాను - అయినా మీకు తెలియదా, అని ఊరుకున్నాను. హూఁ రెండు ఐయిస్‌క్రీం కప్పులు దండగ - ఆ వచ్చేది ఓ కప్పు నా ముఖానకొట్టి మరీ చచ్చింది. '

" శ్రీనివాస - శ్రీనివాస "

" ఊరుకోండిసార్ - ఇంకా విషయం గూర్చి ఆలోచించకండి - అనవసరంగా మనస్సు పాడుచేసుకోకండి - లేవండి - ఔట్ పేషెంట్సు వచ్చారప్పుడే. "

## రోడ్డు వ్యధ

వాహనాలు నా మీద
ఎక్కువగా తిరుగుతున్నాయని కాదు
ఎండకు ఎండుతున్నానని కాదు
వానకు తడుస్తున్నాననీ కాదు
నా శరీరం మీద
గోతులు ఎక్కువ అయిపోతాయని
చీకట్లో వాటిలో ప్రజలు
పాపం పడిపోతారనే
నా వ్యధ...

యర్రగుంట్లపాటి శేషగిరిరావు

" పోయి చూడు అందులో కాన్ఫిడెన్షియల్ కేసెస్ ఏమన్నా వున్నాయేమో .... "

అయ్యంగార్ కనుక్కొని వచ్చాడు.

" లేవుసార్ - మేడపైకి వెళ్ళవలసిన పని లేదు. "

" సరే ఇక్కడికే రమ్మను ఒక్కొక్కరినే "

ఒక పేషెంటు వచ్చాడు. ఆయన బహు కాలంగా అల్సర్‌తో బాధపడుతున్నాడు - రాజు పరీక్షించి అన్నాడు.

" మీరు లోగడ ఏమేమి మందులు వాడారు ? "

" చాలా వాడి చూచానండీ - హోమియోలో ఆల్ఫాల్ఫా వాడాను. ఆయుర్వేదంలో విషూచి మాత్రలు మింగాను. అల్లోపతిలో ఎన్ - టాసిడ్ టాబ్లెట్స్, సోవాల్యు కోల్ కాంపౌడ్ వంటివి చాలా వాడాను. ఫలితం కనిపించ లేదు. "

' ఫరవాలేదు దిగులు పడకండి. నా చేతుల్లో పడితే ఇక నయం కాకపోవడమనే సమస్యే లేదు. '

" ప్రొబాకథిన్ ' అని ఒక మందు వ్రాసిచ్చాడు రాజు. అది తెచ్చుకుని పడుకోబోయే ముందు వేసుకోండి.

" సార్ - ఓ చిన్న అనుమానం "

" ఏమిటి ? "

" డైట్ రెగ్యులేషన్స్ ఏమిటి ? "

" మీకు తెలియని వేమున్నాయి ? క్రానిక్ పేషెంట్ కదా మీరు - ఉప్పూ కారమూ తినకూడదు - పులుపూ గడ్డ కూరలూ వాడకూడదు - అతిగా తినకూడదు - అసలు తినకుండా ఉండకూడదు. "

" ఔనౌను. ఇవన్నీ నాకు తెలిసినవే - కాని ఓ చిన్న మనవి. "

" ఏమిటి ? "

" మావాళ్ళు మొన్ననే కొత్తావకాయ తెచ్చారు - శనగలు పోసిన ఆవకాయంటే నాకు ప్రాణం - తిన కుండా ఉండలేను - చస్తే చచ్చాను కాని కొంచెం - రోజూ ఓ ముక్కమాత్రం వేసుకుంటాను - అనుమ తించండి. "

' మీరలా అంటే నేనింకేం చెప్పను ? "

" చూడండి - మాగాయ ఈసారి చాలా రుచిగా కుదిరింది. అదొక్కసారి రుచి చూస్తాను - ఫరవాలేదు కదా ! "

" ఫరవాలేదు .... "

"ఇకపోతే కారం లేకపోయినా నాకంత అనిపించదుకాని ఉప్పు లేకపోతే ముద్ద దిగదు - ఏదో ప్రకృతివైద్యం చేయించుకున్నట్లనిపిస్తున్నది. దయచేసి ఉప్పు తినడానికి అభ్యంతరం చెప్పకండి. " డాక్టర్ రాజు తల పట్టుకున్నాడు

" చూడండి మీపేరేమన్నారు "

' రంగారావు '

" రంగారావుగారూ - మీరు చెప్పిన వాటికన్నిటికీ నేను ఒపక్కుంటాను కాని దానివల్ల ఫీజుమాత్రం పెరుగుతుంది. "

" మీ ఇష్టంవచ్చినంత ఫీజు వసూలు చేయండి - కాని నన్ను ఆవకాయ మాత్రం తిననిస్తే చాలు - మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోను. "

" మంచిది - వెళ్ళి మా శ్యామూను కలుసుకోండి. "

(స శే ష ం)

# శ్రీ వాణీ గిరిజాశ్శిరాయ

శ్రీ వాణీ గిరిజా శ్శిరాయ అనే ఆంధ్ర భారత నాందీ శ్లోకం ఒక్క భారతానికేగాక తెలుగు సంస్కృతికి గూడ నాందీశ్లోకమే అనవలె. దానిలో స్తుతింప బడిన పద్మోమావాణీ పతులైన హరిహర హిరణ్య గర్భులు సకల భువన రక్షక ప్రభువులు. ఆర్యులు. సృష్టి స్థితి లయాలను నిర్వహించటానికి తమ అర్ధాంగులైన శ్రీవాణీ గిరిజలను ఎల్లప్పుడూ వక్షోముఖాంగాలలో ధరించి ఉంటారు.

పురుషుడు హృదయంలో శ్రీ ని, ముఖాన వాణిని ధరించ వలె. గార్హస్థ్యాన్ని స్వీకరించి స్వశరీరంలో అర్ధభాగంగా భార్యను భావించవలె. అపుడే అతడు సంసార నిర్వహ ణకు సమర్థుడౌతాడు – అనే పై పద్యంలోని సూచనను ఈనాటి యువకులు గమనించవలసి ఉంది.

శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్
నచేదేవం దేవోన ఖలు కుశలః స్పందితుమపి

శక్తితో కూడి ఉన్నపుడే శివుడు ప్రభుత్వానికి సమ ర్థుడు. ఆ తల్లి లేకుంటే అతడు కదలటానికిగూడ సమర్థుడు కాలేడు. అని శంకరాచార్యులవారంటారు. కాబట్టి తమతమ పత్నులను ధరించకుంటె సృష్టికర్త లెవరు తమతమ పనులకు సమర్థులు కాలేరు.

సృష్టికర్తలకు ఆ విధంగా ప్రేరకులైన శ్రీ వాణీ గిరిజ లకు త్రిశక్తులని వ్యవహారం. వారు ఒకరు ధనానికి ఒకరు విద్యకు మరొకరు సకల శుభాలకు అధిదేవతలైన స్త్రీలు కాబట్టి వారు లేకుంటే త్రిమూర్తులకు కార్యశక్తి లేదు.

శ్రీ అనే శబ్దానికి నిఘంటువులో ఐశ్వర్యం – త్రివర్గం అంటె ధర్మార్థ కామాలు–వృద్ధి, శోభ, అలంకారం, కీర్తి బుద్ధి – అనే అర్థాలు కనిపిస్తవి. వీటిపై మనం ఒక పర్యాయం దృష్టిని కేంద్రీకరిస్తే పై లక్షణాలన్ని పురుషుడు హృదయపూర్వకంగా కోరుకుని వరించవలసి నవి గానే తోస్తుంది. శ్రీమహావిష్ణువు కేవలం శ్రీ నే గాదు శ్రీకారానికి చెప్పబడిన అర్థాలన్నీ హృదయమంనిండా కలవాడు. అందుకే అతడు పురుషోత్తముడని కీర్తింపబడినా డనవలె.

శ్రీ లేనివాడు నిశ్శ్రీకుడౌతాడు. అతనిని మా మండ లంలో సేలు దప్పినవాడంటారు. సేలు దప్పిన మొగం, సేలు దప్పినవాడు, సేలు దప్పినవాని చెలుక దగ్గరుంచితె చేరెడురావు బుక్కెడురావు. అని సేలు దప్పినవానిపై జాతీయాలు, సామెతలు గూడ ఏర్పడినవి. శ్రీ మహావిష్ణు వంతటవాడు శ్రీదేవి అలిగి వెళ్ళినపుడు నిశ్శ్రీకుడై కొండలు పట్టినాడు. ఇక మానవుల నడిగేదేముంది. అందుకే శ్రీనాథుడు.

కమలనయన నీవు కలవాడు కలవాడు. లేనివాడు నీవు లేనివాడు – అన్నాడు.

## కపిలవాయి లింగమూర్తి

ఈనాడు మానవులలో గూడ ఎందరికో శ్రీ లేదు. అయితే వారు నిశ్శ్రీకులు కావటం లేదు. అశ్శ్రీకులౌతు న్నారు. ఈ శ్రీ నుంచే రేఫానికి లకారం వచ్చి అశ్లీల రూపం నిష్పన్నమౌతుంది. కాబట్టి నేటి వ్యక్తులను "నానా గుణగణంకాంచన మాశ్రయంతి" అని నానా అవగుణా లన్ని ఆశ్రయించి గుణరూప శ్రీ కి బదులు ఘనరూప శ్రీకై ఎన్నో వేషాలు వేసి అడ్డదారులన్ని తిరుగు తున్నారు.

వ్యక్తికి త్రివర్గ సాధనకు గాని, ఐశ్వర్యానికి గాని, అభి వృద్ధికిగాని, యింటికి అలంకారానికిగాని శోభకుగాని మూలం

## జీ వి త ం

ఎవరి రచన ఓహో ఇది
ఏమి కూర్పు ఎంత నేర్పు
ఎటు నడచిన ఎటులుండునో
ఎటు తలచిన ఎటులగునో
ఏ తలపున ఏముందో
ఎరుగజాల మిసుమంతయు.

ఆశల కావలి పైపున
అభ్యంతరముల కావల
పొంచి ఉన్నదేమిటో
ప్రమాదమో ప్రమోదమో.

పిలిచే ప్రేమల మాటువ
మంచియగునో వంచనయో
చిలికే చిరునవ్వులన్ని
స్నేహాలో కాదో మరి.

ఊపేసే పై చిత్రి
వెర్రిగ ఈ ఉత్కంఠ
ఏదీ రచయిత స్వరము
వివరించగ అర్థాలు.

— డి. సుజాతాదేవి

ఁవ్ స్త్రీ. మహాపురుషుల కందరికీ వారు గొప్పవారు ఁనికి ఎందరి జీవితాల వెనకనో వారికి ప్రేరకులైన ఁరు. పురుషుడులేని స్త్రీ జీవితం ఏవిధంగా పరి గాదో స్త్రీ లేని పురుషుని జీవితం గూడా అంతే. అసంపూర్ణంగానే ఉండిపోతుంది. మన ధర్మ నుసారంగా స్త్రీ లేని పురుషునికి కర్మాధికారం లేదు. ఁనంతటివానికి సీత లేనపుడు బంగారంతో ప్రతి రూపాన్ని చేయించుకోవలసి వచ్చింది. రామాయణ కథ లోని ఈ కల్పన పురుషుని జీవితంలో స్త్రీకి గల ప్రాధా న్యత ఎట్టిదో నిరూపిస్తుంది. అందుచేతనే శ్రీరాముడు సీతను "ఇయంగేహే లక్ష్మి" అని సంభాషించినాడు.

కన్యాదానంనాడు మామగారు "లక్ష్మీనారాయణస్వరూప వరాయ" అని మహాసంకల్పం చదివించి తనను నారాయణ స్వరూపునిగా భావించి "దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా" అని కాళ్ళు కడిగి కూతుర్ని ధారబోస్తున్నాడు. పై మంత్రంలో మామగారు తనను నారాయణస్వరూపునిగా భావించుటలో ఈ కన్య నీకు గృహలక్ష్మి అవుతుంది కాబట్టి నీవీమెను ఎదను దాచుకొని ఏలుకొమ్మనే అభ్యర్థన గూడ ఉంది. కాని దాన్ని గమ నించేది ఎందరు ? ఆచరించేది ఎందరు ?

కలకంఠి కంట కన్నీ, రొలికిన సిరి యింట నుల్లా నొల్లదు సుమతీ ! అనే పాతకాలపునాటి చదువులను విడిచి పెట్టి మనం చాలా ముందుకు వచ్చినాము. ఈనాడు బ్రహ్మలోక జిగిషదానం చేసిన మామగారికిగాదు — కట్నం చాలనినాడు కన్యలకే కలిగించే వార్తలు కొల్లలు.

స్త్రీలకు పాతివ్రత్యం సర్వ సామాన్యంగాని ఒకేమాట ఒకే బాణమని నడుచుకుంటు ఒకే భార్యకు మనసు నంకితం చేసిన శ్రీరాముడు భారతీయుల కాదర్శపురుషుడు. అతడు గడచిపోయి యుగాలు దాటినా ఈనాటికీ మన మతని రాజ్యాన్ని మరచిపోలేక పదేపదే పలవరిస్తున్నాము.

ఎక్కడ స్త్రీలు పూజింబపడతారో అక్కడనే దేవతలు క్రీడిస్తారు. అని వివేకానందుడంటాడు. కాబట్టి దేవతలు ఎక్కడ క్రీడిస్తారో రామరాజ్యం అక్కడనే అవతరిస్తుంది. ఒకప్పుడీదేశంలో స్త్రీని హృదయపూర్వకంగా గౌరవించి, పూజించే ఆచారం, హృదయంలో నిల్పుకొని ఆరాధించే గుణములున్నవి. అందుచేత ఆనాడిక్కడ రామరాజ్యం వెలసింది. దేవతలీ భూమిలో క్రీడించి అడుగడుగునా శిల్పశోభితమైన ఆలయాలు వెలసినవి. కాని ఈనాడు వానిపై మనకెంత గౌరవమున్నదో స్త్రీ పట్ల గూడ అంతే ఉంది. అందుచేత మనం అపూర్వ వైభవాన్ని పొందా లంటే హృదయంలో శ్రీ ని ధరించవలసి ఉంది. ★

# బాలగేయాల విశిష్టత

బాలలలో మానసికోల్లాసాన్ని కలిగించి వాళ్ళ భావి జీవితాలకు వెలుగుని సమకూర్చే శక్తి బాల గేయాలకి వుంది. జానపద సాహిత్యానికి మాదిరి ఈ బాలగేయాలకి కూడా కర్తృత్వం అవిదితమే. ఈ గేయాలు ప్రయత్నం లేకుండా మౌఖికంగా వెలువడి ఉంటాయని చెప్పవచ్చు. ఈ గేయాలు గాన లక్షణాన్ని కలిగివుంటాయనీ, ఆంగిక చలనాన్ని అపేక్షిస్తాయనీ తెలుస్తుంది. నిసర్గ సుందరమై శోభిల్లు ఈ బాలగేయాలలో ప్రాచీనమైన వాటిని స్మరణకి తీసుకురావటమే ఈ వ్యాసోద్దేశం.

పిల్లలకి చదువుపట్ల ఆసక్తిని కలిగించటానికి ఉపన్యాసాలు పనిచెయ్యవు. పాట రూపంగా ఆ పనిని సులువుగా చెయ్యొచ్చు. అందుకనే ఈ గేయం ఆవిర్భవించింది –

“ పలకను పట్టి – బలపము తోడ
అరక, ఆట – దిద్దెదను
గురువులు చెప్పిన గురుతులవన్నీ
విసుగక చక్కా వింటాను
రెండవ ఎక్కం నేరుస్తా
వాచక మొకటి కొనమంటా
తల, వల – పేర్లను చదివెదను
బడికి వేళకు వెళ్ళెదను
పాఠాలన్నీ నేరుస్తా ”

రైలుబండిని చూడటం పిల్లలకి సరదా. ఆ సరదా అక్షర రూపంలో వెలువడితే కలకాలం నిలుస్తుంది కదా ! దాని ఫలితమే —

“ అదిగో అదిగో పొగబండి
గుప్ గుప్ అంటూ పోతోంది
తూ తూ తూ అని కూసింది
అందమైన దా పొగబండి
అమ్మా నేను రైలెక్కి
మామయ్యింటికి వెళతాను ”

దేశ నాయకులు కలకాలం మదిలో మెలగాలంటే పాట మాత్రమే సరైన సాధనం. పిల్లలకి మహాపురుషుల పట్ల గౌరవభావం ఏర్పడడానికి

“ గాంధీ తాతకు జేజేలు
జవహరులాలుకు జేజేలు ”

వంటి పాటలు ఆవిర్భవించాయి. ఆ కోవకి చెందినదే

“ పెద్ద పేరు గన్న వీరేశలింగయ్య
తాతగారు మీకు దండమండి ” అనే పాట.

ద్వా. నా. శా

అభినయం చేస్తూ పాడే పాటలూ ఉన్నాయి, వీటిల్లో నీతిబోధ కూడా కనిపిస్తుంది. ఒక్క చరణం –

“ పెంపుడు చిలుకను నేనైతే
తీయని పలుకులు పలికెదను
ఇరుగు పొరుగు వారిటువస్తే
ఎవరు మీ రని ప్రశ్నిస్తా ! ”

పిల్లలకి ధైర్యాన్ని కలిగించేలా అభినయ పూర్వకమైన గేయం వుంది. ఇది బాల బాలికలలో ఎంతో ఉత్సుకతని కలిగించే పాట. చివరికి ‘ ఉఫ్ ’ అనగానే బెదిరిపోయి కళ్లు మూసెయ్యటం జరుగుతుంది. ఈ ముగింపు కోసమే పిల్లలు ఎదురు చూస్తారు. ఆ పాట–

“ రూకలు పెట్టెద – ఏకులు వడకు
నూకలు ఇచ్చెద – మేకలు కాయి
అటుకులు పెట్టెద – ఆవులు మేపు
బెబ్బులి వచ్చిన – బెదరవుకావా
ఎలుగులు వచ్చిన – ఏడ్వవుకావా
వడగండ్లు రాలిన – వణకవుకావా
ఎంతటి ధైర్యము – ఇటు చూడు మటి ”

## హంపీ స్మృతి

ఈ శిధిలాల హృదయాలలో కదలును
గత వైభవ జ్ఞాపకాల రోదసలు
ఆంధ్ర సంస్కృతిని ఆరాధించిన
లలితకళా శేఖరుడు, రసపిపాసి,
కృష్ణరాయని మధుర కళా నిర్మాణాలు
మరువ రాని ఏ శిల్పవిన్నాణాలు !
విఠలాలయంలో వినిపించు సంగీతాలు
సప్త స్వరాలతో సరస్వతికి హారతులు !
ఏ శిల్పి ఉలిలోని జలపాతాలో ఇవి !
ఏ భావుకుడి స్పందనాగారాలో !
ఈ మధుర నాదాల వినూత్న ఘోషలో
నృత్యం చేసే రాజ నర్తకీమణుల అందెలు
విద్యుద్దీపాల వెలుగును మరపించే
మణి మాణిక్యాల దీప్తి పుంజాలు,
హజారా రామాలయంలో నాట్యభంగిమలు !
నేటికీ పరవళ్ళు త్రొక్కే పంపానది
పులకరింతల్లో గతం పాట వినిపిస్తోంది
విద్యారణ్యస్వామి మహత్తర శక్తికి
స్వామి విరూపాక్షుడే నేటికిని సాక్షి.
ఇది ఆంధ్ర భోజు డిలాతలంపై
నిర్మించుకొన్న స్వర్గధామం !
ఇది లక్ష్మీ సరస్వతుల అపూర్వ మైత్రిలో
రాయలు రచించిన రంగుల కావ్యం !

— చిల్లర భవానీదేవి

ఎంతటి వాళ్ళకైనా పొగరు పనికిరాదనే నీతిని " కుందేలు - తాబేలు " ల సంవాద రూపంగా ఓ పాట ద్వారా బోధించడం సులభం. ఆ పాటను లయబద్ధంగా అభినయపూర్వకంగా ఇద్దరు పిల్లల చేత పాడించినపుడు ఎంతటి ఉత్తేజం కలుగుతుంది ! ఆ పాటలోని నీతి కరతలామలకం అవుతుంది కూడా. ఆ పాట ఇలా ప్రారంభం అవుతుంది —

కుందేలు : పందెము వేయుము తాబేలా ! నీవు
పరుగిడు నాతో తాబేలా !

తాబేలు : పోపో ! పోవే కుందేలా !
పొగరు కూడదే కుందేలా !

చివరికి పరుగు పందెంలో తాబేలు గెలిచి ఇలా హితవు చెప్తుంది —

" ఎగిరి పడితివే కుందేలా !
ఏనె జయించితి కుందేలా !
పొగరు మానవే కుందేలా !
పొందిక వలయునె కుందేలా ! "

ఆటలాడుకుంటూ పాడుకొనే పాటలున్నాయి. ఇవి పిల్లలకి విజ్ఞానాన్ని కూడా కలగజేస్తాయి.

" ఒప్పులకుప్పా - ఒయ్యారిభామ
సన్నాబియ్యం - చాయపప్పు " అనే పాట

బాలికల క్రీడకి సంబంధించినది. అక్షరాల గారడీతో పాట పాడుతూ ఆడే ఆట వుంది. ఆ పాట ఇది —

" అచ్చి అమ్మచ్చి చింతాకు దూచ్చి
దూచ్చి దూచ్చి "

బావను వేళాకోళం చేస్తూ సరదాగా పాడే పాట —

" బావా బావా పన్నీరు
బావను పట్టుక తన్నేరు " అన్నది సుప్రసిద్ధమే.

వెంకట్రామా అండ్ కో వారు పూర్వం ఈ బాల గీతాలను ప్రచురించి అందరికీ అందించేవారు. ఇప్పుడు అటువంటి సంస్థలు కరువయ్యాయి. పాఠశాలల్లో కూడా ఈ పాటల్ని తప్పనిసరిగా పాడించాలి. అప్పుడే బాల బాలికలు మానసికంగా ఉత్తేజితులవుతారు. సత్ పౌరులవుతారు. అంతేగాదు మన సంస్కృతికూడా నిలుస్తుంది.



# విశ్వనాథ వారి సారస్వత సంపద

"నేను చాలా సోమరిని ... మరి నేను ఎంత సోమరిని అంటే - నిజానికి నేను వేయిపడగలు, మాబాబు చెలియలి కట్ట, ఏకవీర వ్రాసి నవలాకారుణ్ణి అయినాను. తత్పూర్వం నేను అచ్చంగా కవిని. ఇప్పుడు చాలా మంది 'అయన నవలాకారుడే కాని కవి కాదు' అనే వారున్నారు. ఇందులో భిన్నాభిప్రాయాలున్నాయి. తత్పూర్వం నేను వ్రాసిన కవిత్వం వారికి తెలియక పోవచ్చు. నేను వ్రాసిన కవిత్వం కవిత్వం కాదని కూడా అనుకోవచ్చు."

ఈ మాటలు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారివి. బహుశః ఛలోక్తిగా చెప్పివుంటారు. కవిగా, నవలా రచయితగా, నాటక కర్తగా, విమర్శకుడుగా, వక్తగా, పేరు పెంపులు గడించిన విశ్వనాథవారు సోమరులంటే ఎవ్వరూ నమ్మరు. ఆయన శతాధిక గ్రంథకర్త. తెలుగు సంస్కృతాలలో రచనలు సాగించిన సవ్యసాచి. అహరహమూ సాహితీ క్షేత్రంలో వ్యవసాయం సాగించి, రకరకాల పంటలు పండించిన ఉత్తమ హాలికుడు ఆయన. కనుకనే విశ్వనాథ సాహిత్యం వైవిధ్య విలసితమై, సుసంపన్నమై కానవస్తుంది.

విశ్వనాథ వాఙ్మయసూచిక ప్రకారం, ఆయన వెలయించిన గ్రంథాల వివరం : 25 కావ్యాలు (చిన్నవీ పెద్దవీ); 15 నాటకాలు; 57 నవలలు (కథానికా సంపుటులతో కలిపి); 9 విమర్శనములు; 3 సంపాదిత గ్రంథాలు. సంస్కృతంలో కొన్ని కవితలూ నాటకాలూనూ. పత్రికా ముఖంగా ఆయన వ్రాసిన వ్యాసాలూ, సాహిత్య ప్రసంగాలూ ఇతరుల రచనలకు వ్రాసిన పీఠికాదులు మొదలైనవి ఎన్నెన్నో. ఇవి కాక సర్వేపల్లి రాధాకృష్ణగారి కల్కి, స్వామి వివేకానందుని యతిగీతం. ఆదిశంకరుల ద్వాదశ మంజరి మొదలైనవాటిని తెలుగు చేశారు. ఈ వివిధ రచనల్ని అలవోకగా పరిశీలించినా, విశ్వనాథవారు సోమరులంటే ఎవ్వరూ నమ్మరు. 1026 పుటల గ్రంథం వేయి పడగలు (10వ ప్రచురణ). సుమారు 2200 పుటల బృహద్గ్రంథం శ్రీ మద్రామాయణ కల్పవృక్షం ! అలసత్వం ఆయన మొదటి శత్రు వనవచ్చు !

**డా॥ చల్లా రాధాకృష్ణశర్మ**

విశ్వనాథ సాహిత్యంలో వైవిధ్యం కనిపించినట్లుగా, ఆయన శైలిలోనూ వైవిధ్యం చోటు చేసుకుంది. ఒకొక్కసారి ఆయన రచన సులభ సుందరంగా తెలుగు నుడికారానికి పట్టుకొమ్మగా ఉంటుంది. ఒకొక్కసారి మరీ ప్రౌఢంగా కనిపిస్తుంది. కాగా ఆయన ప్రౌఢ కవిగా, "పాషాణ పాక ప్రభువుగా" ప్రచిత యశస్కులు కావడంలో ఆశ్చర్యం లేదు. ఏమైనప్పటికీ తనకే సొంతమన దగిన ఒక విలక్షణమైన శైలిని సంతరించుకున్నారు. ఇది ఆయన పద్య రచనకే కాదు, వచన రచనకూ వర్తిస్తుంది. ఇటువంటి రచయితలు సకృత్తుగా కనిపిస్తారు.

విశ్వనాథ అనగానే నాకు ఓం ప్రథమంగా స్ఫురణకు వచ్చే రచన ఆంధ్రప్రశస్తి. ఆయన రచనలలో ఇదే నేను మొదట చదివిన కావ్యం. ఇందులోనూ ఆంధ్ర పౌరుషం లోనూ అచ్చమైన ఆయన ఆంధ్రాభిమానం గూడు కట్టుకుంది. ఆంధ్ర రాజ్యముల పేర్లు చెపితేనే చాలు, ఆయన హృదయం చలించి పోతుంది; చిత్తవృత్తి ఆర్ద్రి మవుతుంది. కనుకనే తెలుగు మాగాణమును పునీతం కావిస్తున్న జీవనదుల్ని పురస్కరించుకుని ఆయన ఆంధ్రప్రశస్తిని తెలియజేసిన తీరు చిరస్మర

ణీయం. ఆపాత మధురమైన ఈ పద్యం అందుకు సాక్ష్యం.

“ గోదావరీ పావనోదార వాఃపూర
మఖిల భారతము మాదన్న నాడు
తుంగభద్రా సముత్తుంగ రావము తోడ
కవుల గానము శ్రుతి గలయునాడు
పెన్నానదీ సముత్పన్న కైరవ దళ
శ్రేణిలో తెన్గు వాసించు నాడు
కృష్ణా తరంగ నిర్ణిద్ర గానముతోడ
శిల్పమ్ము తొలి పూజ సేయు నాడు
అక్షర జ్ఞానమెరుగదో ఆంధ్రజాతి ?
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు. ”

తెలుగు నదులే కాదు, తెలుగు రాజులే కాదు, తెలుగు ఋతువులు సైతం విశ్వనాథవారిని బహూథా ఆకర్షించాయి. ఆయన కవితలో మెట్ట పొలాల మిసమిసలే కాక వేసవి కాలపు రుసరసలు కూడా కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. దండెంమీద వేసిన గుడ్డ కొంగుజారి కింద వున్న దాలి సెగకు అంటుకుందట; దొడ్లో పొయ్యార్పగా అందులో ఏమూలనో మిగిలిన రవ్వ గాలికి రగిలి పైకెగసిందట; దృష్టి తీసి మంటలో వెయ్యగా అందులోని మిరపతొడిమ మిలమిలా పేలి చూరు తాకిందట. ఇవన్నీ పరశురామ ప్రీతికి హేతువులు. ఈ నిశితమైన పరిశీలన వల్ల కూడా విశ్వనాథవారి కవితలకు ఒక ప్ర త్యే క త కలిగినట్లు భావించవచ్చు. ఇంత ఆంధ్రాభిమానం ఉండడం వల్ల కాబోలు తెలుగుని “ పరమోదాత్త సహజ శక్తిగల ” భాషగా వర్ణించారు విశ్వనాథవారు. ఏది ఎలా ఉన్నా, ఆయన తెలుగు భాషాభిమానమూ తెలుగు దేశాభిమానమూ పేర్కొనదగినవి.

విశ్వనాథ గేయ రచనలలో కోకిలమ్మ పెళ్ళి ఒకటి. కాని ప్రచుర ప్రచారం పొందిన రచన కిన్నెరసాని పాటలు. గానానుకూలత, భాషా సారళ్యం గేయ రచనకు ముఖ్యంగా ఉండవలసిన లక్షణాలు. ఇవి కాక భావ గాంభీర్యం కూడా ఆయన గేయ రచనలో కనిపిస్తుంది. తెలుగు నుడికారపు సొంపు ఆ గేయ రచనకు పెట్టని భూషణం.

కోకిలమ్మ పెళ్ళిలోంచి ఒకటి రెండు గేయాలు :

“ వానలన్నీ వెనుక పట్టి
కోనలన్నీ నీరు పట్టి
ఆకు రాలే కారు కూడా
ఆగిపోయిందీ.
చిన్న మొగమున కుంకు మిడినా
కన్నె పేరంటాలి మల్లే
చెలువుగా అడివంత క్రొత్తగా
చివురు తొడిగిందీ.
గోదుమా వన్నె త్రాచల్లే
కొబ్బరి పాలల్లే అడవీ
చిన్న పూటా వొదగి వొదగీ
చెన్ను వొలికిందీ....”

ఆయన ఇంకా ఎన్నో కావ్యాలు వెలయించినా విశ్వనాథ కావ్యసాహిత్యానికే కాక తెలుగు సాహిత్యంలోనూ శ్రీమద్రామాయణ కల్పవృక్షం తలమానికంగా భావించ బడుతున్నది. 1934 లో ప్రారంభమైన ఆ కావ్యం 1962 లో పూర్తయింది. సుమారు మూడు దశాబ్దాలపాటు సాగిన రెండు వేల నూట ఎనభై తొమ్మిది పద్యముల బృహత్కావ్యమిది. ఇతర రామాయణ కవుల వలె విశ్వనాథవారు కూడా వాల్మీకి రామాయణమును అనుస రించినా, కథా సంవిధానంలో కొన్ని మార్పులు చేశారు.

కల్పవృక్షంలో నాకు నచ్చిన ఘట్టాలలో ఒకటి శబరీ ఖండం. శబరిని భక్తి రసపు ముద్దగా విశ్వనాథవారు అభివర్ణించారు. ఆమె శిరస్సు “ నివ్వరి వెన్నుల యట్లు ముగ్గు బుట్ట ” వలె ఉందట. అది చూచి, అలా ముగ్గు బుట్ట కావడానికి కారణమేమిటని రాముడు అడగ్గా –

" ప్రభవ ! నీ యాత్మ వాకిట రంగవల్లి
నించుటకు నింత గాగ పండిన "

దని శబరి జవాబు చెప్తుంది. ఈ రెండు చిన్న పాదాలలో అనల్పమైన ఆమె భక్తిభావం కళ్ళకు కట్టినట్లుగా చిత్రించబడింది.

తాను తెచ్చిన పళ్ళు తినమని శబరి రాముణ్ణి ప్రార్థిస్తుంది. ఈ నట్టడివిలో నన్ను నిలబెట్టి పళ్ళు తినమంటే ఎలా ? అని రాముడు కొంచెం తటపటాయిస్తాడు. నిత్య పవిత్ర మూర్తివయిన నీకెందుకయ్యా స్నానాదులు ? అంటూ ఇలా చెపుతుంది శబరి.

" చేతులనికి బూలు తెచ్చితిని స్వామి
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి
స తను వగుటను నేను వచ్చితిని స్వామి
చిత్తముండుట నూహ చేసితిని స్వామి
నాదు ప్రాణములను నీకు మీదు కట్టి
నాదు నీవయి యిటు వచ్చినావు స్వామి
మ్రొక్కు చెల్లింతు, స్వీకరింపుము .... "

విశ్వనాథ వాఙ్మయ సూచికా సంపాదకులు పేర్కొన్నట్లుగా, "ఆయన రచన లన్నింటిలోనూ ఎడపెడగా విమర్శనకు విషయమైనది శ్రీమద్రామాయణ కల్పవృక్షము. ఆయన మహాకవి యన్నవారికిని అదే ఆధారగ్రంథము. కాదన్న వారికిని అదే ఆధార గ్రంథము." వాదోప వాదములు ఎలా ఉన్నా, అవాల్మీకాంశములు ఉన్నా, శైలి కొన్ని చోట్ల జటిలంగా ఉన్నా, ఇతివృత్తం, కథా సంవిధానంబట్టి చూసినపుడు శ్రీమద్రామాయణ కల్పవృక్షం విశ్వనాథవారి సాహిత్యానికి త ల మా ని క మ నే నా అభిప్రాయం.

విశ్వనాథవారి సాహిత్యంలో నవలలు చిన్నవీ పెద్దవీ సుమారు 60 దాకా కనిపిస్తాయి. వీటిలో కొన్ని సాంఘికములు ; మరికొన్ని చారిత్రకములూను. కొన్ని నేపాళ చరిత్రకు సంబంధించినవి ; కొన్నియేమో కాశ్మీర చరిత్రకు సంబంధించినవి. వీటిలోని చారిత్రక విషయాలు

## అహంకారం

" నాకు ఏ పనీ చేయవలసిన అవసరం లేదు. నేను నిమిత్తమాత్రుడను " అన్నావంటే అహంకార పడుతున్నావన్న మాట. ఈ అహంకారం చేతగానితనానికి నిదర్శనం. అహంకారమే గదా ! అదే పోతుందిలే అనుకున్నావంటే అదీ అహంకారపడడమే ! ఇది చాలా విచిత్రమైనది. ఎంత బలం ఉంటే అంత అహంకారం ఎంత తెలివి ఉంటే అంత అహంకారం. ఎంత విద్య ఉంటే అంత అహకారం. ఇక్కడే ప్రతి ఒక్కరూ మేల్కోవాలి. అంటే భగవంతుడు వీటిని ప్రసాదించింది మన గొ ప్ప త నా న్ని ప్రదర్శించడానికి కాదనీ, మనం అనందించి ఇతరులకు పంచిపెట్టడానికనీ గ్రహించాలి.

ఎంతవరకు సహేతుకములో పర్యాప్తంగా పరిశీలిస్తేనేగాని స్పష్టంగా చెప్పలేము. కల్హణుని రాజతరంగిణి వంటి చారిత్రక గ్రంథాలనూ, పురాణములనూ విశ్వనాథ వారు సంప్రతించినట్లు తెలియవస్తున్నది. కల్యాది విషయములలో కల్హణుడు పొరబడినట్లు ఆయన అభిప్రాయం. " చరిత్రలోని ప్రధానాంశములను వదిలి పెట్టలేదు .... ఇన్ని నవలలలో చరిత్రాంశములను తీసివేయ, కథలన్నియు నేను కల్పించినవే. వందలాది విలక్షణమైన పాత్రలు నేను సృష్టించినవే, " అని కూడా ఆయన ఒకచోట పేర్కొన్నారు.మన దేశచరిత్రను పునః నిర్మించవలసిన అవసరం ఉన్నదని మన చరిత్రకారులు విశ్వసిస్తున్న విషయం నలుగురికీ తెలిసిందే. భారతదేశానికి సముద్రమార్గం కనుగొన్న వాస్కోడగామా విషయంలో ప్రస్తుతం ప్రచారంలో ఉన్న అభిప్రాయాన్ని సరిదిద్దవలసిన అవసరం కలదంటూ

ఒకచరిత్రకారుడు ఆ మధ్య కోజికోడ్‌లో జరిగిన ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు తాలూకు 37వ సమావేశంలో ఉద్ఘాటించిన విషయాన్ని మనం విస్మరించకూడదు. అటువంటప్పుడు భారతదేశపు అతిప్రాచీన చరిత్రను గురించి భారతీయ చరిత్రకారుల అభిప్రాయాలకూ పాశ్చాత్య చరిత్రకారుల అభిప్రాయాలకూ మధ్య వైరుధ్యం ఉండటంలో ఆశ్చర్యం లేదు. చారిత్రక విషయాలు ఎలా ఉన్నప్పటికీ, విశ్వనాథవారి ఈ నవలలు ఒకదానివలె ఇంకొకటి ఉండకపోవడం ఒక గొప్ప విశేషం. ఇది ఆయన రచనాశక్తినీ, భాషమీద ఆయనకి గల అధికారాన్నీ చాటుతున్నది. ఆయనే పేర్కొన్నట్లుగా "నా పద్య ప్రపంచక మెటువంటిదో నేను నిర్మించిన గద్య ప్రపంచకము నట్టిదే. ఎంగిలికూడు లేదు." ఇది నిజంగానే ప్రశంసార్హం.

విశ్వనాథ సాహిత్యానికి వైశిష్ట్యం కలగడానికి ప్రధాన కారణం ఆయన కావించిన పాత్ర సృష్టి అని నా అభిప్రాయం. ఆధునికాంధ్ర సాహిత్యంలో పాత్రలు సృష్టించిన రచయితలు పలువురు లేరనడం సత్య సన్నిహితం. ఆయనలోని ఉపజ్ఞకిది నిదర్శనం. పాత్రను సృష్టించి పరిపోషించడంలోనే రచయిత ప్రతిభ ద్యోతక మవుతుంది. చారిత్రక నవలలో ఆయా పాత్రల ద్వారా ఆనాటి వాతావరణాన్ని పాఠకుల మనోనేత్రం ముందు నిలపగలిగినవాడే ఉత్తమ చారిత్రక నవలా రచయిత. ఈ విషయంలో విశ్వనాథ సిద్ధహస్తుడు. ఆయన చారిత్రక నవలలు చదువుతుంటే అప్పటి వాతావరణంలో మనం సంచరిస్తున్న అనుభూతి కలుగుతుంది.

ఇకపోతే వేయిపడగలు, ఏకవీర, చెలియలి కట్ట మొదలైనవి బాగా ప్రచారం గడించిన నవలలు. వేయి పడగలు ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం. అందులో ఎన్నో విషయాలు చర్చించబడినవి. పాతలో ఒక నమ్మకం, అదే సమయంలో క్రొత్తలో ఒక మోహం – ఈ రెంటికీ జరిగిన సంఘర్షణను ఈ నవలలో ప్రధానంగా చూడవచ్చు. ఆకృతిలో చిన్నదయినా అంతస్సత్వంలో గొప్ప నవలగా భావించబడుతున్నది ఏకవీర. స్వర్గానికి నిచ్చెనలు నవలలో ఆస్తికుల మనుకొనేవారి వంచన వివరించబడింది. మ్రోయు తుమ్మెద హిందూస్తానీ సంగీతానికి సంబంధించిన రచన.

నర్తనశాల, అనార్కలీ, అంతా నాటకమే, కావ్యవేద హరిశ్చంద్రములు మొదలైన నాటకాలు కూడా విశ్వనాథ వారు సంతరించారు. ఆయన లేఖిని నుంచి సాహిత్య విమర్శ గ్రంథాలు సైతం వెలువడ్డాయి. నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి, అల్లసానివాని అల్లిక జిగిబిగి; కావ్య పరిమళము వంటి విమర్శ గ్రంథాలు సుమారు పది రచించారు.

నాకు తెలిసినంతవరకూ విశ్వనాథవారివలె, ఇంత అపారమైన సాహిత్యాన్ని సంతరించిన రచయితలు ఆధునిక భారతీయ సాహిత్యంలో చాలామంది కనిపించరు. అంతేకాక తాను నమ్మిన సిద్ధాంతాలను మొగమోటము లేకుండా ఆయన తన రచనల్లో తెలియజేశారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సారస్వత సంపద అపారమయింది కనుక సద్విమర్శలు వెలువడినప్పుడే ఆ సంపదకు సరియైన విలువ కట్టడానికి వీలు కలుగుతుంది. ఎలా వ్రాసినా, సమకాలికులు మెచ్చుకోరనే అభిప్రాయం ఒకటి వాడుకలో ఉన్నా, రస హృదయులైన సద్విమర్శకులు కొందరైనా ఉండకపోరు.

ఆయన సాహిత్య సంపదలా, ఆయన పొందిన గౌరవాలు కూడా అపారం. భారత ప్రభుత్వం ఆయన్ని పద్మభూషణుని చేసింది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం ఆస్థాన కవిగా గౌరవించింది. విశ్వవిద్యాలయాలు సముచిత రీతిని సమాదరించాయి. సాహిత్య సంస్థలు చిన్నవీ, పెద్దవీ సమ్మానించాయి. కేంద్ర సాహిత్య అకాడెమీ ఆయన్ని విశిష్ట సభ్యునిగా (ఫెలో) ఎన్నుకుని గౌరవించింది. అకాడెమీ ఒక రచయితకు చేసే అత్యుత్తమ గౌరవమిది. ఇక ఆయన పాఠకులా! కోకొల్లలు. నిజానికి ఒక రచయిత సిరిసంపదలు అతని స్థిర చరాస్తులు కావు. రస హృదయులైన పాఠకులే రచయితకు నిజమైన ఆస్తి. విశ్వనాథవారు అక్షరాలా ఆస్తిపరులు !



# చెట్లను తొలిచే వడ్రంగిపిట్ట

వడ్రంగిలా కలపతో అందమైన వస్తువులు చెయ్యటం చేతకాకపోయినా ఉలి లాంటి పదునైన ముక్కుతో చెట్లను తొలుస్తుంది కాబట్టి దీనిని వడ్రంగిపిట్ట అన్నారు. మన ప్రాంతంలో విరివిగా కనిపించే ఈ వడ్రంగిపిట్ట మడగాస్కర్ లాంటి కొన్ని సముద్ర ద్వీపాలలో తప్పించి అన్ని ఖండాలలో కనిపిస్తుంది. పధ్నాలుగు అంగుళాల వరకు ఎదిగే ఈ పక్షికి పెద్ద తల, ధృఢమైన, పదునైన ముక్కు కలిగి వుంటుంది. సాధారణంగా పసుపుపచ్చ లేదా ఎరుపు రంగు కలిగిన ఈకలుంటాయి. తలమీద అవే రంగులో వుండే ఈకలకుచ్చు వుంటుంది.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు




వడ్రంగిపిట్ట కొమ్మలమీద వాలదు. కిందిగా ఎగురుతూ వచ్చి చెట్టు కాండం మొదట్లో వాలుతుంది. మిగిలిన పక్షుల కాళ్ళకు నాలుగు వేళ్ళుంటే ఈ పక్షి కాళ్ళకు మూడు వేళ్ళే వుంటాయి. ముందుకు ఉండాల్సిన మూడు వేళ్ళలో ఒకటి వెనకకు తిరిగి వుంటుంది. వీటి సాయంతో చెట్ల కాండాలను గట్టిగా పట్టుకుని నిటారుగా నిలబడుతుంది. ఈ పక్షి నిలువుగా చెట్టుమీదికి ఎక్కుతుంది. అదే విధంగా కిందికి దిగుతుంది. తోకలో వుండే ఈకలు చాలా ధృడంగా వుండి చెట్టు కాండానికి అదిమిపెట్టి వుంచుతాయి. అందువల్ల పక్షి కిందపడదు.

పదునైన ముక్కుతో ఇది చెట్లను తొలుస్తుంది. నోటిలో బాగా సాగే గుణం గల నాలిక వుంటుంది. ఈ నాలుక జిగటలాంటి పదార్థాన్ని స్రవిస్తుంది. చెట్టు తొర్రలోకి నాలుకను పంపించినపుడు, కీటకాలు నాలుకకు అంటుకపోతాయి. అప్పుడు ఆ కీటకాలను ఆహారంగా తీసుకుంటుంది. సాధారణంగా వడ్రంగిపిట్టల ఆహారం కీటకాలే అయినప్పటికి కొన్ని జాతులు పండ్లను, నత్త గుల్లలను తింటాయి. నత్తలు, పండ్లు సమృద్ధిగా లభించేప్పుడు వాటిని ఒక ప్రత్యేక పద్ధతిలో దాచుకుంటాయి. చెట్టుకొమ్మల్లో చిన్నచిన్న గుంటలను తొలిచి, వాటిలో వీటిని ఇరికిస్తాయి.

వడ్రంగిపిట్ట అరుపు మనిషి నవ్వినట్లుగా వుంటుంది. జంట కలిసే సమయంలో వడ్రంగిపిట్టలు సంజ్ఞలను ఇతర పక్షులలాగ అరుపులతో పంపవు. ఎండిన కొమ్మలను ఎంపిక చేసుకుని వాటిమీద ముక్కుతో పొడుస్తూ శబ్దం చేస్తాయి. ఒకవిధంగా టెలిగ్రామ్‌లు పంపటానికి మనం వాడే మోర్స్‌కోడ్ లాంటి శబ్దాలను చేస్తాయన్నమాట. ఆడమగ పక్షుల మధ్య సంకేతాలు పంపుకోవటం ముగిసిన తరువాత చివరికి జంట కలుస్తాయి.

వడ్రంగిపిట్టలు చెట్లను తొలచి గూడు కట్టుకుంటాయి. తెల్లగా గుండ్రంగా వుండే గుడ్లను రెండు నుంచి ఎనిమిది వరకు పెడతాయి. గుడ్లు అతిత్వరగా అంటే 12-15 రోజుల్లోనే పొదగబడతాయి. ఆడమగ పక్షులు రెండు పొదుగుతాయి. అప్పుడే పుట్టిన పిల్లలకు ఈకలుండవు. కళ్ళు కనపడవు. అందుచేత అవి విపరీతంగా అల్లరిచేస్తూ వుంటాయి ఆహారాన్ని సంతానానికి అందించడం ఆట మగ పక్షులు రెండూ చేస్తాయి. 

# అంతర్జాతీయ (వార) పత్రికలు

## తీసుకునే శ్రద్ధ ఇలా ఉంటుంది

### మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

ప్రపంచంలో అత్యధికంగా మాట్లాడబడే భాష ఇంగ్లీష్. ఆ భాషలో వెలువడే పత్రికలకి గిరాకీ సహజంగానే అధికంగా వుంటుంది. అందులో అమెరికా లోని షికాగో లాంటి నగరం నించి వెలువడే అంతర్జాతీయ వార పత్రిక 'టైమ్' గిరాకీ అత్యధికంగా వుంటుంది.

టైమ్ కొన్ని ప్రత్యేకతలలో దాని కవర్ పేజి ఒకటి. ఆ కవరు మీదకి ఎక్కగలిగిన వాళ్ళు ఆ యా రంగాల్లో నిష్ణాతులై వుంటారు సాధారణంగా. అది వారికి ఎంతో గర్వ కారణం.

అగష్టు 15, 1983 సంచిక టైమ్ కవర్ పేజికి ఓ ప్రత్యేకత ఉంది. ఇంత దాకా ఆ కవరు మీదకి ఎక్కిన వ్యక్తుల్లో అతి తక్కువ వయసుగల వ్యక్తి ఫోటోని ఆ సంచిక కవర్ మీద ప్రచురించారు.

'లిజోహరస్' అనే 6 నెలల వయసు గల 'బేబి' అందమయిన ఫోటోని ప్రచురించారు. ఆ స్టిల్‌ని సంపాదించటానికి టైమ్‌లో పని చేసే ఎడిటర్స్, ఫొటోగ్రాఫర్స్ పడ్డ కష్టం, తీసుకున్న శ్రమ గురించి తెలిస్తే, అధిక ప్రజాదరణ, సర్క్యులేషన్ గల పత్రికలు తీసుకునే శ్రద్ధ ద్యోతక మవుతుంది.

చిన్న పిల్లల పెంపకం గురించి ఆ సంచికలో వైద్య విభాగంలో ఓ వ్యాసం వేశారు. కవరు పేజీకి ఐదారు నెలల వయసు కల పాప ఫోటో వేయాలని నిర్ణయించారు.

టైమ్ ఫోటోగ్రాఫర్ గార్డన్ మన్రో న్యూయార్క్‌లో పిల్లల ఫోటోలని సరఫరా చేసే ఓ కంపెనీ యజమానిని కలిసి చెప్పారు ఆ వయసు గల పిల్లలు ఫోటో కోసం కావాలని. తన దగ్గరున్న 200 పాపలలోంచి ఎనిమిది మందిని ఆయనకు పంపారు. ఆ ఎనిమిది మందిని ఫోటోలు తీశాడు గార్డన్. ఆ ఫోటోలు చూసి ఎడిటర్స్ ముగ్గురిని ఎన్నుకొన్నారు.

ఆ ముగ్గురు పాపలతో గార్డన్ ఒక్కొక్కరితో ఒక గంటసేపు గడిపి లెక్కలేనన్ని ఫోటోలు తీశారు. ఒకో పాప తల్లితండ్రులకి గంటకి 75 డాలర్లు (750 రూ॥లు) చెల్లించాడు. అతను తీసిన వందలాది ఫోటోల్లోంచి ఎడిటర్ ఒకటి ఎన్నికచేసి దాన్ని కవర్ పేజీకి వాడారు.

టైమ్ కవర్ పేజీ మీదకి ఎక్కిన అధిక వయస్సు గల వ్యక్తి పేరు "అమోస్ అలోన్ జోస్టేన్". 1968లో 96 ఏళ్ళ వయసుకల ఇతని ఫోటోని ప్రచురించింది టైమ్. ఆయన ఫుట్‌బాల్ ఆటగాడు.



# యారమిత్రా వనమాలినా (కథ)

## 'ప్రణతోస్మి దివాకరమ్' ఒకసారి సూర్యభగవానుడికి నమస్కారం చెయ్యటానికి తల పైకి ఎత్తారు వెంకటశాస్త్రిగారు.

అప్పుడు కనిపించాయి ఆయనకి బాగా మగ్గిన జామపండ్లు - బత్తాయి కాయ సైజులో వున్నవి.

వెంకటశాస్త్రిగారు గుంటూరు హైస్కూలులో తెలుగు పండితుడిగా వున్నారు. ఆయనకి ఇద్దరు కూతుళ్ళూ, ఇద్దరు కొడుకులూ. కూతుళ్ళు పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకు వెళ్ళిపోయినారు. కొడుకులు యిద్దరూ వుద్యోగరీత్యా దూర ప్రాంతాలలో వుంటున్నారు. ఇంటి దగ్గర వెంకటశాస్త్రిగారూ, ఆయన భార్య వర్ధనమ్మగారూ వుంటున్నారు.

వెంకటశాస్త్రిగారు యింకొక సంవత్సరంలో రిటైర్ అయిపోతారు. ఆయనకి బడిలో ' రేలంగి ' అని పేరు. రజ్ఞులు ఆయనను " వసంతకుడు " అంటారు. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ వుండే మనిషి.

వెంకటశాస్త్రిగారు ఐదున్నర అడుగుల పొడుగు వుంటారు. కాస్త బొద్దుగా చామనచాయ రంగులో వుంటారు. ఎప్పుడూ చలాకీగా హుషారుగా వుండటం మూలాన గాబోలు వయస్సు అంత ఎక్కువగా కనబడదు. ఆయన భార్య వర్ధనమ్మగారు దాదాపు ఆయన అంత ఎత్తూ వుంటుంది. పచ్చగా దబ్బపండు రంగుతో వుండే వర్ధనమ్మగారు వెంకటశాస్త్రిగారికి పూర్తిగా వ్యతిరేకం. ఆయన ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూండే మనిషి అయితే ఆమె ఎప్పుడూ మౌనంగా వుండే మనిషి. ఆమె రోజులో చాలా భాగం మడిలోనే వుంటుంది.

వెంకటశాస్త్రిగారు ఉదయమే స్నానం, సంధ్య ముగించి, నీళ్ళు తులసి కోటలో పోసి సూర్యభగవానుడికి నమస్కారం చేద్దామని తల ఎత్తేటప్పటికి ఆయనకి కన్పించాయి రెండు దోర పండిన జామపండ్లు - జామచెట్టు కొమ్మన.

వెంకటశాస్త్రిగారు చుట్టూ చూశారు. ఆయన భార్య వర్ధనమ్మగారు స్నానాల గదిలో వున్నది. మరి దాపులో ఎవ్వరూ లేరు.

వెంకటశాస్త్రిగారికి చిన్నప్పటినుండి చెట్లూ చేమలూ ఎక్కే అలవాటు లేదు. అయినా తెగించారు. ధైర్యే సాహసే లక్ష్మి, కృషితో నాస్తి దుర్భిక్షమ్ మొదలైనవన్నీ స్మరించారు. పట్టుబట్ట పైకి ఎగకట్టి చెట్టుమీదకు ఎగబాకుతుండగా ....

### చింతపల్లి అన్నపూర్ణ

" ధనాధన్ "

బ్రహ్మ పేడ పడినట్లు పైనుంచి కింద పడ్డారు వెంకటశాస్త్రిగారు. లేచి దుమ్ము దులుపుకున్నారు. మోచేతి మీద రూపాయ నోటంత డాగు. రక్తం వోలలాడుతున్నది.

శాస్త్రిగారు ఒక్కసారి మోచేతి వైపు బాధగా చూసుకున్నారు. అంతలో తేరుకున్నారు. ఇది గాయం కాదు. భగవంతుడు తనకు ప్రసాదించిన వరం. నిస్సారమూ, నిస్తేజమూ అయిన తన జీవితంలో ప్రవేశించిన చైతన్య స్రవంతి. ఇది కలలై అలలై తనను ఎంత ఎత్తుకు

తీసుకు వెళ్ళనున్నదో. రన భరితమై, తేజోవంతమై తనను ఎంతటి కథానాయకుడిగా చేయనున్నదో.

భోజనం చేస్తున్నప్పుడు శాస్త్రిగారు గాయం భార్య కంట బడకుండా జాగ్రత్త పడ్డారు.

బడికి వెళ్ళే దోవలో డాక్టరు దగ్గరికి వెళ్ళారు శాస్త్రిగారు.

నిజానికి అది అంత పెద్ద గాయం కాదు. డాక్టరు దగ్గరికి వెళ్ళవలసిన పని లేదు. కాని దానికి రంగులు పులిమి, చిలవలూ పలవలూ పుట్టించి ఎంతో ఎత్తుకు ఎదగ దల్చుకున్న శాస్త్రిగారు గాయాన్ని డాక్టరుకు చూపించి ఎంతో బాధ నటినయించారు.

"ఎట్లాగ తగిలిందండీ యింత దెబ్బ" కుర్ర డాక్టరు ఆసక్తిగా అడిగాడు.

"ఏముందండీ ! ఉదయాన్నే మా పక్కింటి హైస్కూలు పిల్లలు క్రికెట్టు ఆడుతూంటె నేనూ వెళ్ళాను ఆడటానికి. చిన్నప్పుడు బాగా ఆడేవాణ్నిలెండి. ఫీల్డింగ్ చేస్తున్నప్పుడు కేచ్ పక్కనుంచి పోతుంటే పడి పట్టాను. గాయమైంది" అన్నాడు శాస్త్రిగారు.

నిజానికి వెంకటశాస్త్రిగారు చిన్నప్పటినుండీ ఏ ఆటలూ ఆడి ఎరుగరు. ఈనాటికి ఆ ముచ్చట తీరింది – ఆ గాయం మూలాన.

'అబ్బ' కుర్ర డాక్టరు నోటినుండి అప్రయత్నంగా వెలువడిన ఆశ్చర్యార్థకం.

"ఈ వయస్సులో మీకు యింకా ఆటలు ఏమిటి చెప్పండి" కుర్ర డాక్టరు మందలింపుగా అన్నా అతని కళ్ళల్లో ఎంతో ఆరాధన, మెచ్చుకోలు ఒక్క రవ్వ అసూయ గూడా.

ప్రఖ్యాత హాలీవుడ్ దర్శకుడు డేవిడ్ లీన్ "లారెన్స్ ఆఫ్ అరేబియా" చిత్రాన్ని తీస్తున్నప్పుడు ఎడారిలో రైలు పడిపోయిన దృశ్యాన్ని తీయవలసి వచ్చిందట. ఎడారిలో రైలు పట్టాలు వేసి రైలు నడుస్తుండగా ఒక్క సారి డైనమైట్‌తో పేల్చివేశారట – అంతా రిగ్గా అనుకున్నట్లె జరిగిందట. అట్లాగే వెంకట శాస్త్రిగారు అనుకున్న ఫలితాన్ని ఖచ్చితంగా డాక్టరు కళ్ళల్లో చూడ గలిగేరు.

వెంకటశాస్త్రిగారు సిటీ బస్ ఎక్కగానే బాగా పరిచయం వున్న కండక్టరు అడిగేడు "అదేమిటి మేష్టారూ, చేతికి ఆ దెబ్బ ?"

వెంకటశాస్త్రిగారు సర్దుకున్నారు. ఈ సారి యింకొక ముచ్చట తీర్చుకోవాలి.

"ఏం లేదయ్యా ! మా పక్కింటి పిల్లవాడు రోడ్డు మీద గోలీలు ఆడుతుంటే ఎద్దు పొడవటానికి మీదకు వచ్చింది. చప్పున వెళ్ళి దాన్ని బలంగా తోసేశాను. దాని కొమ్ము రాచుకుపోయింది. అదృష్టం సుమా. కొంచెం వుంటే కొమ్ము పొట్టలో గుచ్చుకుపోవాల్సిన పని."

"అబ్బ" కండక్టరు నోటి నుండి అప్రయత్నంగా వెలువడిన ఆశ్చర్యార్థకం !

నోరు తెరుచుకుని చూస్తున్న కండక్టరు కళ్ళల్లో ఒక పూజ్యభావం – తను కోరుకున్నది.

ప్రఖ్యాత హాలీవుడ్ దర్శకుడు విలియమ్ వైలర్ "వూథరింగ్ హైట్సు" చిత్రాన్ని తీస్తున్నప్పుడు ఒక దృశ్యాన్ని పంతొమ్మిదిసార్లు తీసి కూడా 'ఒకే' చెయ్య లేదట. విసుగు పుట్టిన నటుడు లారెన్స్ ఒలీవియర్ "మేమేం చెయ్యాలో చెప్పండి" అన్నాడుట. విలియమ్ వైలర్ "మీరు సరిగ్గా చెయ్యాలి" అన్నారుట ఇరవై సారి తీసిన టేకులో ఒలీవియర్ కళ్ళల్లో విసుగు స్పష్టంగా కనబడిందట. టేకు 'ఒకే' అయింది.

అట్లాగే శాస్త్రిగారికి కండక్టరు కళ్ళల్లో తను ఆశించిన భావం స్పష్టంగా కనబడింది. ఒక్క "టేకు" లో షాట్ ఒకే చెయ్యగలిగినందుకు గర్వపడ్డారు శాస్త్రిగారు.

బళ్లో అధ్యాపకులూ, విద్యార్థులు చాలామంది అడిగారు "ఆ గాయం ఏమిటండీ" అని.

"ఓహ్ యిదా ! ఇదేముందిలెండి. మా మనవడు అర్జెంటుగా రైలుకు వెళ్లాలి అంటేనూ పక్కింటాయన

దగ్గర మోటర్ సైకిల్ తీసుకుని తీసికెళ్ళి దిగబెడుతున్నాను. మలుపు తిరగగానే ఎదురుగుండా లారీ వచ్చేసింది. లారీ బోనెట్ గీసుకు పోయింది. కొంచెంలో తప్పింది ప్రాణాపాయం." అన్నాడు శాస్త్రిగారు.

నిజానికి వెంకటశాస్త్రిగారికి సైకిలు తొక్కటం కూడా రాదు. కాని ఆయన యీనాడు బకోర్ఫ ఎంతో ఎదిగాడు.

మార్క్‌ట్వైన్ రాసిన కథలో టామ్ సాయరు కాలికి దెబ్బ తగులుతుంది. టామ్ సంతోషం పట్టలేకపోతాడు. కాలికి కట్టు కట్టుకుంటాడు. నొప్పి లేకపోయినా తెగ కుంటుతాడు. అందరికీ "టామ్" గొప్ప హీరో.

శాస్త్రిగారు నొప్పి లేకపోయినా తెగ నొప్పి నటించారు "జ్వరం తగుల్తుంది" అన్నారు అందరూ ఆయన్ని కేకలు వేశారు. ఈ వయసులో "మీకు మోటారు సైకిలు ఏమిటి". అని ....

వెంకటశాస్త్రిగారు సాయంత్రం విజయగర్వంతో యింటి వైపు బయలుదేరారు. మధ్య దారిలోనే కట్టు తీసి అవతల పారవేశారు. దానితో పని యిక అయిపోయింది. ఇంటికి రాగానే స్నానం ముగించి వరండాలో పడకకుర్చీలో కూలబడ్డారు.

వర్ధనమ్మగారు వాకిట్లోకి వచ్చి అంది "ఆ గాయం ఏమిటండీ ?"

"ఏదో గీసుకుంది లేవే" వెంకటశాస్త్రిగారు సర్ది చెప్పారు. భార్యముందు అబద్ధం చెప్పే ధైర్యం ఆయనకు లేదు.

వర్ధనమ్మగారు పింగాణీ పళ్ళెంలో జామ ముక్కలు తెచ్చి ఆయన ముందు స్టూలు మీద పెట్టింది. తను పక్కనే చతికిలబడి రెండు ముక్కలు తీసి కొరుకుతున్నది.

"తీసుకోండి" అంది ఆయనతో.

"ఎక్కడివే యివ్వి" అన్నాడు శాస్త్రిగారు ఆశ్చర్యంగా.

"మన చెట్టు కాయలేనండీ! పొద్దున్న చూస్తే పై కొమ్మమీద కనబడ్డాయి" అన్నది వర్ధనమ్మగారు.

## కరువు కాలము

గంగిగోవుపాలు గంటెడైనను చాలు
ఒకనాడు,
పుచ్చినవైనా చచ్చినవైనా
కావాలి ఓట్లు వందలు నేడు
ఇది మంది యుగము,
వంద గొర్రెల మళ్ళవేసే
కాపరిదే భోజ్యము...
మంచి చెడు విజ్ఞానము దెలిసిన
మానిసికి అమావాస్యే...
అందుకే యిది సందడి కాలము,
శాంతికి కరువు కాలము.

— అరుణప్రియ

"ఎట్లాగ కోశావే" అన్నాడు శాస్త్రిగారు ఆశ్చర్యంగా.

"ఏముందండీ! మధ్యాహ్నం పూట దొడ్లో ఎవరూ వుండరు గదండీ! నేనే పైకెక్కి కోశాను" అన్నది వర్ధనమ్మగారు గుసగుసగా.

"అబ్బ" వెంకటశాస్త్రిగారి నోటినుండి అప్రయత్నంగా వెలువడిన ఆశ్చర్యార్థకం. ఆయన కళ్ళల్లో ఒక ఆరాధనా భావం – ఆయన కోరుకోనిది.

ప్రఖ్యాత అమెరికన్ చిత్రకారుడు జాన్ టంబ్లర్ ప్రఖ్యాత అమెరికన్ చిత్రకారుడు థామస్‌కోల్ గీసిన చిత్రాన్ని చూసి అన్నాడుట "నేను జీవితం అంతా దేన్ని అయితే సాధించాలి అని కృషి చేసి సాధించలేకపోయినానో యితను దాన్ని సాధించివేశాడు"

వెంకటశాస్త్రిగారు చెట్టెక్కి కాయలు కోయాలి అని సంకల్పించారు. కానీ దాన్ని సాధించలేకపోయినారు. ఆయన భార్య దాన్ని సాధించివేసింది.

"కాయలు మహా తీపి సుమండీ" అన్నది వర్ధనమ్మగారు తేనుస్తూ.

"ఊ" అన్నాడు వెంకటశాస్త్రిగారు నిర్లిప్తంగా. ★

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
కవితా కామేశ్వరశ
అవనిగడ్డ - 521 121

**డి. బలరామకృష్ణ** నందిగామ

ప్రశ్న : నేను 1st B. Com. చదువుచున్నాను. తరువాత ఉద్యోగము చేయుదునా ? వ్యాపారమా ? ఇంకా చదువుదునా ? స్నేహితులలో చెడు వారున్నారా ? నాకిప్పుడు మంచి కాలమా ? లేక చెడు కాలమా ?

సమా : మీ కిప్పుడు కుజదశ 21-8-91 వరకు. యిది మంచిది కాదు. మీది కన్యాలగ్నం. కుజ 3-8 అధిపతి. ధనంలో స్థితి. Very Bad పైగా ఏలినాటి శని ప్రారంభ మైనది. గనుక చెడుకాలము. స్నేహితులలో చెడు వారుంటారు. B. Com. పూర్తి అగునని తోచదు. వ్యాపారం లాభిస్తుంది జీవితంలో. డిగ్రీ రాదగిన గ్రహస్థితి (Planetary Positions) ఉన్నవి. లగ్నంలో గుకే. 4 లో చు. 5 లో రబు యివి మంచిది విద్యకు. కాని కుజదశ విద్యకు అంత మంచిది కాదు.

చూడండి : ధనస్సురాశి అని వ్రాస్తూ రాశ్యాధిపతి బుధుడు అని వ్రాశారేమిటి ? గురువు కదా ధనూరాశ్యధిపతి. "ధనుర్మీన ద్వ యోర్మంత్రీ" అని శాస్త్రం.

**డి. హేమంతకుమార్** నందిగామ

ప్రశ్న : నేను ఫైనల్ బి. కాం. చదువుచున్నాను, ప్యాస్ అగుదునా ? ఉద్యోగం వస్తుందా ? ఉద్యోగంలో రాణిస్తానా? వ్యాపారంలోనా ?

సమా : జాతకం పంపినవారు కూపన్‌లో లేఖ వ్రాయు తేది Time etc. వ్రాయనక్కరలేదు. మీరు రెండూ పంపినారు. అయితే మీ జాతకంలో దశాశేషం లేదు మీ తమ్ముడు జాతకంలో దశాశేషం వ్రాశారు మీ తమ్ముడు. మీరు మరచిపోయారు కాపీ చేయడంలో. నాకు పని కల్పిస్తే ఎట్లా ? పాత పంచాంగం తీసి దశాశేషం వేసుకోనా ?

మీ జాతకం బాగుంది. మంచి ఉద్యోగమో మంచి వ్యాపారమో చేస్తారు. బాగా సంపాదిస్తారు. డిగ్రీ ఉంటుంది. ప్రస్తుతం మంచి కాలమే జనరల్‌గా. వ్యాపారం బాగుంటుంది.

**ఎమ్. దుర్గాంబ** బందరు

సమా : మీ బాబు ప్రాక్టీసు (లా) చేస్తాడు. లాభదాయకం. 1986 లో వివాహం అవకాశములున్నవి గాని గ్యారంటీ లేదు. పరాయి సంబంధం కాదగును.

మీ విషయంలో ప్రస్తుతం గ్రహచారం బాగుండలేదు. శారీరక మానసిక సుఖములు తక్కువ. మీ మంచిని గ్రహించేవారు తక్కువ. అది మీ గ్రహస్థితి సోదరీ ! (మీరి లేఖ పెద్దదగుటను సమాధానం మాత్రం వ్రాశాను)

---

## జ్యోతిషవాణి

పేరు ....................................

పూర్తి చిరునామా....................................

....................................

....................................

లేఖ వ్రాయు తేది....................

టైము పగలు/రాత్రి....................

జనన తేది............తేదిలేనిచో సుమారు వయస్సు

# ప్రాచీనకాలంలో వంటలు - విశేషాలు

ఈ నాటి వంటలు, పానీయాలకు ప్రాచీన కాలంలో నున్న వాటికి కొన్ని మార్పులు, చేర్పులు ఉన్నాయి. పూర్వము వంటలలో పానీయాలలో మన ఆరోగ్యము, ఇతర సాంఘిక అవసరములు, ప్రాంత వాతావరణమునకు సంబంధించి ఉంవేవి.. ఈనాటి పానీయాలు కన్న ఎంతో మంచిని చేకూర్చేవి క్రమముగా మనకు దూరమయ్యాయి. మర్చిపోవడము జరుగుతున్నది.

పూజ్యశ్రీ ఆదిశంకరులు రెండువేల ఏండ్లనాటివారు వారు తమ "శ్రీ మృత్యుంజయ మానసిక స్తోత్రం" లో కొన్ని వంటలు, పానీయాలు గూర్చి ప్రస్తావించారు. ఈ పదార్థాలను చేసి చూడండి. ఇవి ఆరోగ్య ప్రదములు. దిగువ వాటిలో మిరపకాయ పూర్తిగ నిషేధము.

## పద్దాదిత రాజః

(1) ఓ మృత్యుంజయ ! ఇంగువపొడి, శొంఠిపొడి కలిపినట్టిది, నిమ్మరసము, సైంధవలవణము (లేక సముద్రపు ఉప్పు) తో బాగా చిలికిన మజ్జిగ ఇదిగో. యథేచ్ఛగ త్రాగుము. దీనిని సురుచిర తక్ర కల్పనము అంటారు.

(2) నిమ్మపండ్ల రసము, అల్లపు ముక్కలతో కూడిన పుల్లని మామిడి ముక్కలు ఇవిగో, దేవ గ్రహించుము. (ఇందు లవణము కోరినచో కలుపుకొనవచ్చును.)

(3) దేవ ! ఇంగువ, జీలకర్ర పోపు (తాలింపు) పెట్టిన ఊరగాయలు ఇవిగో. మిక్కిలి మధురమైన వెలగపండు లేహ్యమిది. లవణములో ఊరవేసిన తామర తూండ్ల ముక్కలివిగో.

(4) దేవ ! అరటిచెట్ల యందలి ఊచ ముక్కలు (దవ్వ ; దూట ) ఆవపిండితో కలిపి, రుచియైన నూనెతో వేయించిన అవాలు, జీలకర్ర మొదలైన పాకములతో కలిపిన సవ్యాహారమిదిగో. (ఇందు లవణము చెప్పబడక పోయిననూ అది అవసరమను విషయము సాధారణము)

ఇట్లే ఆవకాయలు పెట్టునపుడు ఈనాడు విశేషంగా మిరపకాయలు వాడుతున్నారు. నూరేండ్లకు పూర్వము విదేశము నుండి వచ్చిన ఈ "మిరియపు కాయ" అంతగా ప్రచారము లేదు. అవకాయలో 'ఆవ' మాత్రమే ప్రధానమైనది. మిరపకాయ గుండ వేయక "మిరియాలు" మాత్రమే కలిపేవారు పూర్వము. (మిరియాల గుండ మాత్రము కాదు. ఆ మిరియాలు క్రమంగా ఊరి తినేటప్పుడు రుచిని ఇస్తాయి. మిరప మాని మిరియాలతో పెట్టిన అవకాయ రుచిలో తక్కువ ఏమీ ఉండదు. మిరపకాయ వాడకం కొంత తగ్గించినట్లు అవుతుంది. కొంచెము "మిరియపు ఆవకాయ" పెట్టి చూడండి. నిత్యావసర వస్తువులుగా మిరపకాయను తగ్గించడము ; మిల్లు పంచదార ను మానడము ఎంతో మంచిదని పెద్దలు భావిస్తున్నారు. ★

## స్వీకారం

శ్రీ మద్భగవద్గీత (పద్యానువాదము) : వెల : 30
రచన : దమ్మ తానయ్య
ప్రతులకు : మణిమాల పబ్లికేషన్స్
"శ్రీ సాయి నిలయం" 1-9-52/సి/2 రాంనగర్
హైద్రాబాద్ - 500 048

శ్రీరామకథామృతము (సమగ్ర సమీక్ష)
రచన : డా. తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి
ప్రతులకు : శివశ్రీ ప్రచురణలు
కోర్టు వీధి : పొన్నూరు - 522 124

అనురాగం రచయిత్రిగా అనన్య సామాన్య ప్రచారం పొందిన రచయిత్రి—

వారి మాటలు వింటూనే పొంగిపోయింది. విమర్శకులూ, ఛాందసులూ తన రచనలలో సామాజిక స్పృహ ఉండదని దుయ్యబడితే దుయ్యబట్టారు.

కాని తనకి...తన రచనలకి ప్రజలలో ఎంత ఆదరాభిమానాలున్నాయని! వీళ్ళే ప్రత్యక్ష సాక్ష్యం అందుకు.




ఆమె నా గదిలోకి తీసుకువొచ్చారు ఆమె రచనలని స్తుతిస్తూ. ఒక్కొక్క రచననూ వారు గుర్తు చేస్తూంటే తనకెంత చక్కని అభిమానులున్నారనుకుంటూ పొంగి పోతూందామె.

చుట్టూ అభిమానులు....మధ్య తను.

అందరూ విద్యావంతులు....యువకులు.

" ఒకరి ఊపిరి ఒకరు పీల్చుకుంటూ....ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ ఒకరినొకరు ఎల్ల వేళలా అంటి పెట్టుకుని ఉండాలి దంపతులు...."

" ఔను. నా రచనల సారం బాగా గ్రహించారు " అందామె మహా ఆనందంగా.

" గ్రహించకపోడానికి మీరు రాసే ప్రతి నవలలోనూ ఆదేగా. చూడండి....నవల నిజమయితే ఎలా ఉంటుంది ? "

" కల నిజమయితే అన్నట్లు....నవల నిజమయితే.... బలేగా ఉంటుంది...."

" చూద్దాం "

ఒక మగబొమ్మని బయటకు తీశారు. "ఇదే యితనే మీ జీవన సహచరుడనుకోండి. "

జరిగిన కథ

ఆ గదిలో చాలామంది కూర్చున్నారు. అందరూ పేషంట్ల బంధువులే. అప్పుడే వచ్చిన డాక్టరు వాళ్ళ వాళ్ళకి వచ్చిన కొత్త జబ్బు పేరు 'నవలా మానియా' ఇది తనే పేరు పెట్టానని ఆవిడ చెప్పింది. వీళ్ళని తయారు చేసేది ఆ నవలలు, సీరియల్స్ రాసే రైటర్స్ అన్న అభిప్రాయాన్ని ఆమె వెలుబుచ్చింది. అందులో ఆరేడుగురు ఒక 'సాహిత్యోద్ధరణ సమితి'గా ఏర్పడి రైటర్స్, వాళ్ళయొక్క నవలలోని, అసహజత్వాన్ని వేలెత్తి వాళ్ళకి తెలిసేలా చేసారు. హైద్రాబాద్‌లో బీచ్, కోరమండల్ రాజమండ్రిలో ఆగటం ఇలాంటివి వారి రచనలలో మచ్చుతునక. మూర్ఛల సీరియల్ ఇంకొకటి. సమాజంలో రచయిత పాత్ర ఎంత ముఖ్యమయిందో వాళ్లకి వివరిస్తారు.

(ఇక చదవండి)

ఆమె తెల్లబోతూంది - అర్థం కాక. వాళ్ళా బొమ్మను ఆమెకు కట్టేశారు. "ఈ బొమ్మలోంచి మీకు గాలి వొస్తుంది. అదే మీకు ఊపిరి" అంటూ ఆమె ముక్కుకీ ఆ బొమ్మకీ కలిపి గొట్టాలు పెట్టారు. "ఒకరినొకరు ప్రేమించుకుంటూ.... ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ ఉండటమే. చూద్దాం, ఎన్నాళ్ళుండగలరో...."

ఒక యిరుకు గదిలో పెట్టేశారామెనీ ఆ బొమ్మనీ కలిపి. అరవడానికైనా ఆమె కవకాశం లేదు. గదిలో బంధించి వచ్చేశారు.

ఆమావాస్య.... ఆదివారం.... అర్థరాత్రి.... ఊరు వదిలి నిర్జనమయిన ప్రదేశంలో పరుగెడుతూంది జీపు. తోవ ఏమీ బాగులేదు. అటూ ఇటూ పేరు తెలియని ముళ్ళ తుప్పలు....ఎటు చూసినా పెద్దపెద్ద చెట్లు .... తాడిచెట్లు తల ఊపుతున్నాయి. ఈతచెట్లు జడ్ల విరగబోసుకుని విలయనాట్యం చేస్తున్న ఆడవాళ్ళలా ఉన్నాయి.

ఎక్కడో నక్క యూల.

గుడ్లగూబ అరుపు.

కీచురాళ్ళు గీ పెడుతున్నాయి. ఆకాశం నల్లదుప్పటిలా ఉంది.

జీపు ఆగింది.

"ఇదేమిటి" అడిగాడతను.

"మీ నవల్లో వర్ణించే స్మశానం."

"ఎందుకొచ్చాం యిక్కడికి ? ఫారిన్ లిక్కరుందని కదా నన్ను తెచ్చేరు ? ఏ హోటలుకో గదికో కాక యిక్కడికి తెచ్చారెందుకని ?"

వాళ్ళు నవ్వేరు. "ఇక్కడ యీ రాత్రి దెయ్యాలతో గడిపి .... చాలా విషయాలు తెలుసుకుని - రేపింకో భయంకరమయిన నవల రాస్తారని."

"అంటే ?"

"ఈ రాత్రి మీ నివాసం యిక్కడే."



"ఆ !" వెర్రిమొహం వేశాడతను విపరీతంగా భయపడినట్లు.

"కాళరాత్రి ... కటిక చీకటి .... కన్ను పొడుచుకున్నా ఏమీ కానరావడం లేదు. శ్మశానం మృత్యువులా భయంకరంగానూ విశృంఖలంగానూ ఉంది. గోరీ మెల్లగా విచ్చుకుంది ...."

"వొద్దు .... ప్లీజ్ ...." అరిచాడు రైటర్. భయంతో అతని గొంతుక కీచుగా మారిపోయింది. చెమటతో బట్టలు తడిసి ముద్దయి పోతున్నాయి.

"నీ కథారంగం .... భయమెందుకూ ?"

వాళ్ళతన్ని ఒంటరిగా అక్కడే వదిలేశారు. అతను కేకలు పెడుతున్నా వినిపించుకోకుండా జీపుని లాగించేశారు.

ఆ అమావాస్య .... అర్ధరాత్రి .... స్మశానంలో సమాధుల నడుమ ... చీకటిలో చినుకులలో రైటర్ ఒక్కడూ !

వాళ్ళ దృష్టిలో అతను చేసిన నేరం - ప్రేత సాహిత్యం సృష్టించడం.

*  *  *

" జంప్ ! " అరిచాడతను.

సుమారు నాలుగడుగుల వెడల్పున్న ఆ కాలువ మీంచి - మిగిలిన యిద్దరు యువకులూ గెంతేశారు.

కాని - ఆమె మిగిలిపోయింది, దిక్కులు చూస్తూ. ఒకతను వచ్చాడు.

" మీరు గెంతరేం ? "

ఆమె - సిగ్గు పడుతున్నట్లు తల వొంచుకుంది.

" మేము గెంతేశాముగా ? "

" మీరు .... మగవాళ్ళు .... " అనలేక అనలేక అందామె.

" ఆడా మగా సమానమేగా ! " రెచ్చగొడుతున్నట్లన్నాడతను.

ఆమె మౌనంగా ఉండిపోయింది.

" ఇన్నాళ్ళూ మగవాళ్ళు ఆడవాళ్ళని అణగ్రదొక్కుతున్నారు. ఏం ? "

" మరే. "

" ఇప్పుడు .... మ గ వా డు ఆడదాన్ని పైకెత్తుతున్నాడు. " అంటూ ఆమెను అవలీలగా పైకెత్తాడా బలిష్టుడు. ఆమె కెవ్వుమంది.

వన్ .... టూ .... త్రి

బాస్కెట్ బాల్‌ని విసిరినట్లు కాలవ అవతలకి విసరాడామెను. అవతల ఉన్న యువకులు ఆమె నందుకున్నారు. దించారు నేలమీద.

ఆమెకు నిలువెల్లా చెమటలు పోసేశాయి.

పది నిమిషాల వరకూ ఆమెకు నోరు పెగలలేదు. ఆయాసపడుతూ .... రొప్పుతూ .... భయంగా ఉండిపోయింది.

" రన్ ! " అరిచాడు అతను. మిగిలిన వాళ్ళందరూ పరుగెత్తారు. ఆమె మాత్రం .... కదలలేక పోయింది.

" ఏం ? ఆడా మగా ఒకటేగా ? .... " " నీ నవలలన్నీ .... " అప్పటికా మెకు తెలివివొచ్చినట్లుంది. " లేదు .... " అంది మెల్లగా.

"ఆడా మగా ఒకటే అయితే అందమూలేదు ఆనందమూ లేదు సృష్టిలో. కొన్నింటిలో ఆడవాళ్ళ ప్రత్యేకత.... కొన్నింటిలో మగవాళ్ళ ప్రత్యేకత. గుర్రాలు స్వారికి.... గాడిదలు బరువులు మొయ్యడానికి. సమానత్వమంటూ అటునుంచి యిటు చేయబోతే అంతా అస్తవ్యస్తమే. నీకు చేతనయితే - నీ రచనల ద్వారా - సమానత్వాన్ని కాదు. స్త్రీ పురుషుల సహజీవనంలో సౌందర్యాన్ని సృష్టించు. వారిని మంచి స్నేహితుల్లా చెయ్, బద్ధ శత్రువుల్లాకాదు."

*  *  *

"రాయల్ శాల్యూట్ .... తందూరీ చికెన్ .... ప్రాన్ ఫ్రై . ఫిష్ సూప్.... కంపెనీకి కాబరే గర్ల్ .... మందు .... విందు ... పొందు. అనంతరం మీకు అభిమానుల చేత ఘనసన్మానం. ఓ. కె. ? "

" ఓ. కె. "

" పూవుతో కూడిన దారానికి లాగ .... మీతోపాటు మీ శ్రీమతికి ఓ పట్టుచీర. "

" థాంక్యూ.... థాంక్యూ. "

శ్రీమతిని వెంటేసుకుని అతను మరోమాట అనకుండా కారెక్కాడు. కారు - పావుగంట అనంతరం - ఒక బంగళా ముందు ఆగింది. ఆ బంగళా ఒంటరిగా ఉంది. అటూ యిటూ చాలా దూరంగా తప్ప యిళ్లు లేవు. అతనికి ఆ గదిలోకి అడుగుపెట్టేవరకూ రెడ్ కార్పెట్ ట్రీట్ మెంట్ (ఘన స్వాగతం) యిచ్చారు.

అతనూ ఆమే ఆ గదిలో అడుగుపెట్టడమేమిటి, తలుపులు మూసుకున్నాయి. వాళ్ళ కెదురుగా.... నలుగురు కూర్చున్నారు.

" మీరు.... వేరే గదిలో రెస్టు తీసుకుందురుగాని...." అని ఆమెను మరో గదిలోకి పంపేసి - బాటిలు తెరిచారు.

గ్లాసులలో మందు, ప్లేట్లలో విందు....కంపెనీకి కాబరే ఆర్టిస్టు.

" పెళ్ళికి ముందు అనుభవం ఉండాలంటారు. శోభనం గదిలోకి ఎల్ బోర్డు (L Board) పెట్టుకు వెళ్ళకూడ దంటారు. ఔనా ? " రెండు రౌండులయ్యాక అడిగాడు.

" మరే....ఆ విషయం మీద ఏభై వారాల సీరియల్ రాశానుగా. "

" ఔను. మేమంతా చాలా ఆత్రంగా చదివాం. ఎందుకంటే – మేము బ్రహ్మచారులం." "నవ్వి మాకు పెళ్ళి సంబంధాలు కుదిరాయి. " అన్నాడు.

" కంగ్రాట్స్. "

" కాని....మాకు....అనుభవంలేదు. "

" అదెంత ? "

" కాల్‌గర్ల్సూ....కాబరే ఆర్టిస్టులు కారు....ఫ్యామిలీ లేడీతో తొలి అనుభవం పొందాలని....అందుకే మిమ్మల్ని సతీ సమేతంగా ఆహ్వానించాం...."

" అంటే ? " ఆ రచయిత తృళ్ళిపడ్డాడు.

" అంటే ...అదే...." నవ్వాడతను....లేస్తూ.

" ఆయ్ ! ఆగు....ఏమిటి నీ ఉద్దేశం ? ఆ గది వేపు ఎందుకు వెళుతున్నావ్ ? ఆ గదిలో ఉన్నది నా భార్య, " అరిచాడు.

" అందుకే, " నవ్వాడతను వక్రంగా. రచయిత అతని మీదకి లంఘించబోయాడు. కాని .... మిగిలిన ముగ్గురూ అతన్ని గట్టిగా పట్టుకున్నారు.

రచయిత నిస్సహాయంగా మిగిలిపోయాడు.

అతని కన్నుల ముందే....

ఒకరి తరువాత ఒకరుగా....నలుగురూ....ఆ గదిలోకి వెళ్ళి వచ్చారు. రైటర్ స్పృహతప్పి పడిపోయాడు ఆ దారుణం భరించలేనట్లు.

ఇలా జరిగినా .... దొంగల తల్లి కేడవ భయమన్నట్లు, ఆ యా రచయిత (త్రు) లు తేలు కుట్టిన దొంగలలా ఊరుకున్నారే తప్ప సాహిత్యోద్ధరణ సమితి తమ మీద ఆడిన క్రూరమయిన నాటకాన్ని ఎవరికీ చెప్పుకోలేదు. కానీ .... వాళ్ళ రచనలు మరి పత్రికలలో కనిపించడం మానేశాయి. పత్రికల వాళ్ళెక్కువ మొత్తం యిస్తామని ఆశ పెట్టినా వాళ్ళు తమ అలవాటు పడిన తరహాలో నవల (సీరియల్) లు రాసేందుకెంతమాత్రమూ అంగీకరించ లేదు. ప్రాచుర్యంలో ఉన్న రచయితలిలా భీష్మించుకు కూర్చునే సరికి పత్రికలు సంకటంలో పడ్డాయి. సరిగ్గా ఆ సమయంలో – మధుమూర్తి – రామచంద్రమూర్తి గురించి ఓ ప్రముఖ పత్రికా సంపాదకుడితో ఓ మాట అన్నాడు. పెళ్ళికూతురు తీగలా ఉందంటే తీగను తెమ్మన్నట్లు ఆ సంపాదకుడు రామచంద్రమూర్తి మీదకు దండెత్తాడు.

" మీ గురించి మధుమూర్తిగారు చాలా గొప్పగా చెప్పారు. వారికి మీరు గురువుగారటగా .... మీరు తప్పకుండా బాగా రాయగలరు. సందేహం లేదు. రాయండి. దెయ్యాల సీరియల్ రాయండి. పాముల సీరియల్ రాయండి. సైంటిఫిక్ ఫిక్షన్ రాయండి. సెక్స్ .... రొమాన్స్ దంచెయ్యండి. పాఠకులు వెర్రెక్కిపోవాలి. పిచ్చెక్కిపోవాలి. సీరియల్ రాస్తా నని అనండి చాలు .... పబ్లిసిటీ మొదలు పెట్టేస్తాం. సంచలనాత్మకం అనేదా ? " అంటూ ఊదరగొట్టేస్తూంటే- త్రుళ్ళిపడ్డాడు రామచంద్రమూర్తి. సంపాదకుడి కంద కుండా పరుగెత్తసాగాడు.

" నా మానాన నన్ను బతకనివ్వండి. నేను సీరియల్ రాయలేను. రాయను. గౌరవంగా బతుకుతాను. " అంటూ – లేని ఓపిక తెచ్చుకుని సంపాదకుడికందకుండా పరుగెత్త సాగాడు. మధ్య మధ్య కేకలు .... " నేను సీరియల్ రాయను బాబోయ్ .... రాయను .... గౌరవంగా బతుకుతాను. "

( స శే షం )

# పుస్తకసమీక్ష

## ఉదయించని రవిబింబాలు

రచన : ఉప్పిలి అప్పలనారాయణ

వెల : మూడు రూపాయలు

ప్రతులకు : సాహితీ సరోవరం

చిట్టివలస - 531 162

శ్రీ ఉప్పిలి అప్పలనారాయణ చిట్టివలస సాహితీ సరోవరంలో చిరు కవితా కదంబ పద్మాన్ని నవ్యాతి నవ్యంగా వికసింపచేయటం ముదావహం. చాలామంది కవులు ఉదయించిన రవిబింబాలునే దర్శించి వర్ణించడం పరిపాటి కానీ, ఈ నవ-యువకవి ఉదయించని రవిబింబాల తీరుతెన్నులను తాను పసిగట్టి, తన కవితా సంపుటి అద్దంలో మనకు కూడా దర్శింపచేయటం విశేషంగా భావించాలి. చిరుగుల అతుకులు/గతుకుల బతుకులు పొద్దు పొడుగునా / చాలీచాలని బతుకులు / ఉదయించని రవి బింబాలు ! / మధ్యతరగతి కుటుంబాలు ! ”

ఆశ-నిరాశల నడుమ అనుక్షణం అలసిపోయే ప్రతి బింబాలకు ఉదయించని రవిబింబాలని పేరు పెట్టటం ఎంతో సమంజసంగా ఉంది. కవి నూతన దృక్పథం ఈ శీర్షిక పెట్టటంలోనే గోచరిస్తున్నది. ఈ కవి నిరాశజీవి కాదు. ఆశావాది. తన ఆశయాల బోధనతో నిద్రపోతున్న సమాజాన్ని వెన్నుతట్టి మేలుకొలిపే నవయుగ వైతాళికుడు. ఈ సంపుటిలో ఆయన స్పృశించని నూతన భావంలేదు. నేడు సమాజంలో పెనుభూతంలా పట్టి పీడిస్తున్న వరకట్న దురాచారాలు; వేశ్యా దుర్భల జీవితాలు; నల్లడబ్బు సంపాదనపరుల కుయుక్తులు; తుచ్ఛ రాజకీయ నాయకుల అరాచకత్వాలు; నిరుద్యోగ నిట్టూర్పులు; లంచగొండి దగాకోరుల కుహన మనస్తత్వాలు; శ్రమశక్తిని దోచుకునే సోమరిపోతుల క్రౌర్యాలు; ఇత్యాది విషయ వైవిధ్యముతో ఈ కవితా సంపుటి సలక్షణంగా భాసిస్తున్నది.

“ దయార్ద్ర హృదయానికి పెట్టింది పేరుగా కరుణా మూర్తికి మారుపేరుగా - పేగులను చించి - శరీరాన్ని కోసి / రక్తపుచిందుల మడుగులలో చరిత్రనే కన్న తల్లిగా / ఘనతకెక్కిన స్త్రీ / సృష్టికే దృష్టి చూపుతుంది!” అంటూ సంభావించిన శ్రీ ఉప్పిలిగారి హృదయ సంస్కారం అభినందనీయమైనది; ఆదర్శవంతమైనది. ‘నవశక్తికి నారుపోస్తూ; యువశక్తికి నీరుపోస్తే ఈ కవి కలం -” “సమాజపు కొలనులో దాక్కొని/ప్రజల రక్తాన్ని పీల్చుకు తాగే”/దుండగపు తిమింగలాలపై తిరగబడుతుంది.

అణువణువు అరిగి / నిలువెల్ల కరిగి / యంత్రాలలో యంత్రమై / ఉత్పాదనలు పెంచే / “శ్రమజీవు” లకు జేజేలు పలుకుతుంది. వారినే దేశానికి రథసారధులుగా నిర్ణయించి, నీరాజనాలు పడుతుంది. శ్రీ ఉప్పిలి చిట్టివలస జ్యూటుమిల్లు ఉద్యోగి కనుక అనునిత్యం శ్రమజీవన సౌందర్యాన్ని ఆహ్లాదిస్తూ, ఆరాధించే గొప్ప భావకుడు. ఈ కవిత్వం అనుభవ దూరం కాదు; అనుభూతుల సింధూరం. ఇన్నేళ్ళ స్వాతంత్ర్యంలో మనం సాధించింది ఏమిటని గుండెమీద చేయి వేసుకుని ఆలోచిస్తే ప్రతి ఒక్కరికి గోచరించే సత్యం ఒక్కటే. “చీకటి వ్యాపారపు దోమలు/ దుర్వినియోగ అధికారపు నల్లులు / ఉన్న రక్తం పీల్చుకు తాగితే / కరుడుగట్టిన జీవితాపేశాలకు ఊపిరెక్కడ ? ” అనే ఆవేదన తప్ప మరేమీ కన్పించదు. ఈ కవిలో అనంతంగా పొంగే ఆవేదన తరంగమే నిర్భయ భావ ప్రకటనకు దారి తీస్తుంది. ధైర్యంతో, శౌర్యంతో పోరాడి మహాత్ములు మనకిచ్చిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించమని ప్రబోధించారు.

“ఈ ప్రేమ నావకు / నీవే చుక్కానివని / నడిపింప వస్తావని / తరియింపజేస్తావని / కొండల్లో పక్షివలె / కిలకిలా అరిచాను / సముద్రంలో అలలు వలె / కింద

( తరువాయి 48వ పేజీలో )

# గారె దండకం

పుచ్చా పూర్ణానందం

లంబోదరయ్యకు లచ్చ ప్రణామాలు
అగస్త్య మహర్షి ఆశీస్సులర్థించి,
కుంభకర్ణు జఠరాగ్ని మనసార కొనియాడి
బడబానలుని ప్రజ్ఞ మేలు బంతిగ నెంచి
వృకోదరు పరాక్రమం ప్రియమార కీర్తించి
ఆహార వీరులకు మంగళారతు లిచ్చి
గారె దండకంబుకు 'శ్రీరామ' చుట్టుచుంటి.
ఏనాటిదోనండి గారె 'గారు'ల మైత్రి
గారెలు మెక్కిన మొనగాడు 'గారు'
గర్జింప గాండీవి హడలి తీరు.
తెనుగోళ్ళ కొంపలో ఇలవేల్పు సుమ్మి.
పంచమ వేదంతో సరితూగ చూడ
అన్యభక్ష్యాలకు కన్నెర్ర కాద ;
లచ్చమ్మకింత లప్ప వుందే కాని
గారె అప్పచ్చికే నోచుకోలేదు,
అర్థనారీశ్వరు నర్థాంగి కొండమ్మ
మాషచక్రంబు చూడనేలేదు,
వాణెమ్మ బ్రహ్మకు రాణి కావచ్చు
చేయమను చూద్దాము చిల్లిగారె !
సారంగపాణికి పినాకపాణికి
గారెలు నమిలేటి భాగ్యంబు కలదె !
గారె తయారీ ఆంధ్ర గృహలక్ష్మికే తెల్సు
తెనుగుతల్లికి గారె గారాలకూచి.
నేతిగారెలే తిన్నారు నేడు పావరు అయ్యారు
ధరణీసురులకు దంతసిరియే సంతృప్తి
దవడ ఏర్పాటు వడలకే కాద !
అత్తలు కొందరు దుత్తలనెయ్యితో మండలం రోజులు మనుగుడుపు మేపంగ
జీలకర్ర బ్రాండు కింగుకాంగు లయ్యారు.
ఈ మధ్య కొందరు శనివార భక్తులు వెంకన్న పేరుతో మందవాసర రేత్రి
గారెలే తింటారు నిష్ఠగాను.
విజయవాడలో "వా" కు దీర్ఘంబు తీసేసి విజయవడగా పేరు మార్చేస్తే
రాజధాని కావచ్చు ఏనాటికైనా ;
సాంబారుతో నీవు సరసమాడేవేళ, ఆవడ పెరుగులో జలకమాడుచునుండ
కాంచి తీరాలె నీ దినుసు నీ సొగసు !
జరవండయా వాడవాడలా వడల పరిషత్తులు
ఏలరా మనకిక ఉపనిషతులు !
గారెల పార్టీలు విరివిగా జరిగితే వర్గ తగాదాలు అంతరిస్తాయి.
శర్మా, వర్మా, చౌదరి, గుప్తా, నాయుడు, పాత్రుడు నానావారలు
విభిన్న గోత్రాల కుద్వాసన చెప్పి, యావదాంధ్రులకు ఆ"వడ" గోత్రమే !
అరవండోయ్, అరవండి దిక్కులు పిక్కటిల్ల !
విందులకు గారె, మందులకు గారె, కల్యాణాలకు, కర్మకాండకూ
తెనుగింట గారె హాజరై తీరాలి.
వడల టెక్నాలజీ అభివృద్ధి చెందాలి, గారెల మిల్లులు స్థాపించి తీరాలి,
గారెల ఓడలు బయలుదేరాలి, డాలర్లు గుంజాలి, తెన్గునేలంతా కనక వర్షంబె !
దేశదేశాలకు గారె సందేశం, తెరచాప ఎత్తరా తెలుగు బుల్లోడ !
పరలోకమేగిన పితృదేవతలు ఏటేట నీ కొరకు ఎదురు చూస్తారె !
ఓ గారెదేవి, అప్పచ్చి తిలక, భక్ష్యాలరాణి, మురిపాల తునక !

లక్కు గలదానివే, నక్కను తొక్కావు, హాస్య
చతుర్ముఖుని చేతిలో పడ్డావు,
దండకం కొట్టావు, నందికేశ్వరు ఇష్టురాలా
కాలభైరవు కంఠమాలా, దాసులమైతిమే, ఓ మినపబాల !
ముజ్జగంబుల గారెకు ఉజ్జీయె లేదు.
సూరయ్య చంద్రయ్య వెల్గునందాక వసుధపై వర్థిల్ల గలవె.
ఇంటింట పెట్టాము నీ ముద్దు పేరు, పండక్కి పండక్కి
మస్తుగా తింటాము,
నీ మీద ఒట్టె ! ఈ ఒక్క విషయాన, అందరమూ
ఒక్కటేను !
ఆరు కోట్లాంధ్రుల పెద్దాడబడుచ ! స్వాగతము,
స్వాగతము, సుస్వాగతంబు !

***

## పుస్తక సమీక్ష

( 46వ పేజీ తరువాయి )

మీద పడ్డాను.” అనే ప్రకృతి తాదాత్మ్యత రూపమైన పరచింత ఈ కవిలోని విజ్ఞతకు ; రసజ్ఞతకు ఎత్తిన పతాక. . ఇంకా ఈ కవి, వివేకపుజ్యోతులు వెలిగించి ; చైతన్య స్రవంతిని ప్రవహింపచేసి ; ఎడారిలో ఉదయాన్ని ఆవిష్కరించి, ప్రశాంత జీవనయాత్రకై ప్రబోధించి తమ కర్తవ్యాన్ని సులక్షణంగా నిర్వహించారు.

కవితా ఉషోదయాన్ని తిలకిస్తున్న శ్రీ ఉప్పిలి మధ్యాహ్నపు మార్తాండుడై నవకవితాలోకంలో చిర స్థాయిగా నిలవాలని, ఉప్పిలి కవితా హృదయం భవిష్యత్తులో అసంఖ్యాకము, నిత్యనూతనము, ప్రగతి ప్రబోధాత్మకము అయిన కవితలను ఉత్పత్తి చేయగలదని (నవ) కవితాప్రియులు ఎదురుచూడటం సమంజసం అని భావిస్తున్నాను.

— ఆచార్య భావన్



## ప్రశ్నలు-సమాధానాలు

1. భూమి బరువెంత ?
2. భూమికి అతి చేరువగా ఉన్న నక్షత్రమేది ?
3. ఇండియాలోని మూడవ పెద్ద నగరమేది ?
4. 'ఎమిరాల్డ్‌దీవి' అని ఏ దీవిని పిలతురు ?
5. ఒక కిలోకి ఎన్ని పౌన్లు ?
6. కంపూచియాకు అంతకు ముందు ఉన్న పేరేమిటి ?
7. మనదేశపు మొదటి విమాన వాహక నౌక పేరేమి ?
8. మన దేశానికి మొదటి బ్రిటిష్ గవర్నర్ జనరల్ ఎవరు ?
9. ' ప్రపంచ పైకప్పు ' ఏది ?
10. 'టెలివిజన్'ను ఎప్పుడు కనుగొన్నారు ?
11. మన దేశంలోని ఆర్థిక వ్యవస్థ పేరేమి ?
12. ఆగ్రా కోటను నిర్మించిన దెవరు ?

★ ★

1. $598 \times 10^{19}$ టన్నులు, 2. ప్రాక్సిమా సెంక్చ్యురీ, 3. ఢిల్లీ, 4. ఐర్లండ్ 5. 2.2 Lbs, 6. కాంబోడియా 7. ఐ.ఎన్.ఎస్ విక్రాంత్, 8. మెకాలే, 9. టిబెట్ పీఠభూమి, 10. 1926 లో, 11. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ, 12. అక్బర్.



# దేవాలయాలలో పెద్ద గంటలు

అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాలతో సముద్రాల లోతులు తెలుసుకుంటున్నారు. ఈ తరంగాల సహాయంతో సిగ్నలింగ్ పంపుతున్నారు. ఇప్పుడు కొత్తగా " అల్ట్రా సోనిక్ మైక్రోస్కోప్ " కూడా కనిపెట్టబడింది. ఇందులో కాంతి తరంగాలు బదులు శబ్ద తరంగాలను పంపినప్పుడు ( Concealed objects ) దాగివున్న అనేక వస్తువుల్ని కనుగొనగలుగుతున్నారు.

ఈ శబ్ద తరంగాల సహాయంతో ఉష్ణాన్ని ఉత్పత్తి చేయవచ్చును. నీరు 0°C లో వున్నప్పుడు ఆ నీటిలోనికి ఈ శబ్ద తరంగాలను పంపుతే నీరు చాలా తొందరగా మరగడం మొదలుపెడుతుంది. వీటితో ( ఈ శబ్ద తరంగాలతో ) ఇప్పుడు అల్ట్రా సోనిక్ డ్రిల్లర్లను కూడా కనిపెట్టారు. వీటి నుపయోగించి లేసర్ కిరణాలలాగా ఎంత గట్టి లోహాన్నయినా కోయడం, రంధ్రాలు చేయడం జరుగుతోంది. ఈ శబ్ద తరంగాల నుపయోగించి అనేక లోహ మిశ్రమాలని తయారుచేయగలుగుతున్నారు. ఆధునిక టెక్నాలజీలో అల్యూమినియం సోల్డరింగ్‌కి ఇవి బాగా తోడ్పడుతున్నాయి. ఈ తరంగాల్ని అనేక రసాయనిక ప్రక్రియలపై వాడుతున్నారు. ఆధునిక వైద్య విజ్ఞాన శాస్త్ర పరిశోధనలకి యీ శబ్ద తరంగాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. వీటి నుపయోగించి కీళ్ళు, కండరాలు, నరాలలోని అనేక రుగ్మతల్ని పోగొట్ట గలుగుతున్నారు. ఇన్‌ఫ్రారెడ్ ( Infrared ) అల్ట్రా వైలెట్ ( Ultraviolet ) కిరణాలు ; అయస్కాంత తరంగాలు ఎన్నో రోగాల నివారణకు ఎలా వాడబడు తున్నాయో, అలాగే ఈ అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాలు కూడా ఉపయోగబడుతున్నాయి. వీటి తోడ్పాటుతో సగం విరిగిన దంతాల్ని సురక్షితంగా తొలగించగలుగుతున్నారు. మోకాళ్ళ నొప్పులు, కొంకర్లు తిరిగిన వేళ్ళు సరిచేయబడు తున్నాయి. రక్తపు నిధులు ( Blood Banks ) కొరతను కూడా యివి పూరించగలవు. రక్తస్రావం జరుగకుండా ఆపరేషన్లు ( Bloodless Surgery ) చేయడానికి యీ శబ్ద తరంగాలు సహాయపడుతున్నాయి.

సైంటిస్టులు ఆధునిక యంత్రాల ద్వారా ఈ శబ్ద తరంగాల్ని ఉత్పత్తిచేసి ఈ విధంగా అనేక ప్రయోజనాలకి వాడుతున్నారు. ఇవి అనేక విధాలుగా ఉత్పత్తిచేయబడు తున్నాయి. అందులో బాగా ప్రసిద్ధికెక్కిన పద్ధతిని " పీజో ఎలక్ట్రిక్ ఆసిలేటర్ మెథడ్ " అని అంటారు. దీనితో కొన్ని స్ఫటికాలలోనికి ( Crystals ) పీడన మార్పులు చేస్తూ ఆల్టర్‌నేటింగ్ వోల్టేజీలతో విద్యుత్తును ప్రసారం చేస్తారు. అప్పుడు ఆ స్ఫటికాల ముందు సంకోచించి తరువాత వ్యాకోచిస్తూ వున్నప్పుడు యీ అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాలు ఉత్పత్తి అవుతాయి.

డా॥ జయంతి కృష్ణమూర్తి

దేవాలయాలలో పెద్ద పెద్ద గంటలు చాలాసేపు మ్రోగించినప్పుడు కూడా యీ శబ్ద తరంగాలు ఉత్పత్తి అయి అనేక రోగ కారక సూక్ష్మ క్రిములను నశింప జేస్తుంటాయి గదా ! అందువలన ఇంత సులభంగా ఉత్పత్తి అయి ఇన్ని ప్రయోజనాలను కలిగిన ఈ శబ్ద తరంగాలను సులభ పద్ధతులలో ఉత్పత్తిచేసి, సామాన్య మానవునికి చవుకగా అందుబాటులో వుండటానికి మన దేశంలో కూడా ఈ విషయమై సమగ్ర శాస్త్ర పరిశోధన జరగాలి. ఆధునిక శాస్త్ర విజ్ఞానంలో ముందంజవేసిన దేశాలు సముద్రంలో దాగివున్న జలాంతర్గాములను కనుగొనుటకు, వాటిపై ఈ అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాలను పంపి, వాటి ద్వారా వాటి వునికిని కనుగొని

సముద్ర ఉపరి భాగమున వున్న యుద్ధ నౌకల నుండి ఈ జలాంతర్గాములపై ( Deep Depth Charges ) బాంబులు విసిరి వాటిని ధ్వంసం చేయగలుగుతున్నారు. విశాఖ సముద్ర తీరంలో 1972 యుద్ధ సమయమునందు మన యుద్ధనౌకవారు గాజీ అనే పాకిస్తాన్‌వారి జలాంతర్‌గామిని కనుగొని దానిపై బాంబుని విసిరి దానిని ధ్వంసం చేసినారు. గబ్బిళములు సహితం అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాల ద్వారా వాటి దోవను తెలుసుకొనగలుగుతున్నాయి. అల్ట్రా సోనిక్ శబ్ద తరంగాలు తక్కువగా వుండే వాటిని Sub-Sonic Sounds అంటారు. Sub-Sonic Sounds కు ఉదాహరణ భూకంపాలు. వీటిని మనుషులు గ్రహించలేరు. కుక్కలు మరికొన్ని జంతువులు మాత్రమే గ్రహిస్తాయి. భూకంపాలు వలన భూమి తరంగాల రూపంలో ప్రకంపిస్తుంది. వీటిని Sub-Sonic Sounds అంటారు. వీటి విషయమై ఇంకా సమగ్ర శాస్త్ర పరిశోధన అత్యవసరం—మన ప్రాచీనులు దేవాలయాలలో పెద్ద పెద్ద గంటలు ఎంతో దూరదృష్టితో ఏర్పాటు చేసారు. శాస్త్ర విజ్ఞానం ( Science ) తో భక్తిని కలిపి మేళవించారు. ★

కళ... ( 16వ పేజీ తరువాయి )

వారు మాత్రం కళాసృజన చేయునప్పుడు తమచుట్టూ వాతావరణం, ఆ కళాసృజనకు అనుకూలమైన స్థితిని కూర్చుకుంటారు కళాశీలులుగా. అప్పుడు వారిలోని తాత్త్వికజిజ్ఞాసను నెమ్మదిగా కొంతకాలము తెరమరుగు చేసుకొంటారు. ఆ విధంగానే తాత్త్వికపరిశీలన చేయునప్పుడు అందుకు అనుకూలమైన వాతావరణాన్ని తమ చుట్టూ జిజ్ఞాసువులుగా కల్పించుకొంటారు. అప్పుడు వారిలోని కళా నిర్మాణ శక్తిని కాసేపు ప్రక్కన ఉంచుతారు సహజంగా !

కళ నుంచి తాత్త్విక పరిశీలనకు వచ్చేటప్పుడు అప్పటి వరకు సంవేదనల భారంతో ఉన్న వ్యక్తి, తాను కాంతి మార్గంలోకి అడుగుపెడ్తున్నట్లు అనుభూతి చెందుతాడు. ఆ విధంగానే అప్పటివరకు తాత్త్విక జిజ్ఞాసలో, అన్వేషణలో బరువైన ఆలోచనలతో ఉన్న వ్యక్తి కళాసృజనలోకి వచ్చినప్పుడు అందమైన ఆనందమయమైన శాంతిమార్గంలోకి వెళ్తున్నట్లు అనుభూతి పొందుతాడు. అందువలన కళాకృతి నిర్మాణంలో దార్శనికుని విచక్షణ ప్రవేశించి పాక్షికతకు చోటు లేకుండా కళా విలువలను సుసంపన్నము చేయడానికి ఆస్కారం కలుగుతుంది. కేవలం ఆదర్శ సౌందర్యమే కాకుండా వాస్తవ సౌందర్యాన్ని అభిమానించే జీవి ఔతాడు. దార్శనికుని పరిశీలనలో రసతత్త్వం మితంగా చోటు చేసుకొని అతని పరిశీలనకు ఒక పరిమళాన్ని యిస్తుంది. అతనిలో కొంత ఆర్ద్రిలా, ద్రవీకరణావచ్చి వ్యక్తిగతంగా దాత్వత్వం పెరుగుతుంది. ఆ విధంగా రెండు విషయాలు వికసిస్తాయి.

కనుక కళాకారునికి తాత్త్విక పరిశీలనలో మానసికంగా ఆలోచనామయమైన ఎదుగుదల వస్తే; తత్త్వజిజ్ఞాసువులకు కళాసృజనలో ఆనందమూ ఏర్పడి జీవితము మధురంగా తడుతుంది. కళ attachment ప్రకృతితో, సమాజంతో, వ్యక్తులతో, తాత్త్వికత Detachment ప్రకృతితో, సమాజంతో, వ్యక్తులతో. అయితే ఈ రెండు విషయాలు సహజీవనంలో నిబద్ధతా, అనిబద్ధలా రూపంలో కలసి ఉంటాయి. అందువలన కళా తాత్త్విక జగత్తులు అనునవి సహజీవనంలో, పరస్పర సహకారంతో సుసంపన్నమౌతున్నవి నిస్సంశయంగా విస్పాక్షికంగా నిర్మలంగా ! మన ఉపనిషత్‌కారులు "ఉత్తమ తత్త్వ చింతైవ" అని పేర్కొనటమూ మన అలంకారికులు "రసోవై సః" అని అనుటయూ గమనించదగినది ! అసలు సిసలైన జీవితానికి కళాసృజనా తత్త్వచింతనా రెండూ అవసరమే ! ఒకటి కాంతినీ – వేరొకటి శాంతినీ ప్రసాదిస్తాయి. మానవ జీవితానికి ఈ రెండు దృక్పథాల సహజీవనావశ్యకత గుర్తించడమే ప్రస్తుతావసరం. ★

# మతాతీత తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి

**ఆధునిక** యుగంలో మతాన్ని, తత్త్వాన్ని స్వార్థ ప్రయోజనాలకు అధికార పిపాస తీర్చుకోవడానికి, భోగ లాలసతకు ఉపయోగించుకోవడానికి రకరకాల దుష్టశక్తులు ప్రయత్నిస్తున్నాయి. అనుభవించడానికి ఆర్థిక సామాజిక పరమైన అవకాశాలేకాక లక్షలాదిగా అనుచర బృందము ఏర్పడినప్పటికి అన్నిటిని తృణప్రాయంగా త్యజించి తనదైన మార్గంలో పూర్ణ జీవితాన్ని గడిపిన యుగ పురుషుడు, తత్త్వజ్ఞుడు జిడ్డు కృష్ణమూర్తిగారు. ప్రపంచ ప్రసిద్ధుడైన ఇట్టి మహా పురుషుడు ఆంధ్రదేశంలో జన్మించడం మనందరికీ గర్వించదగిన విషయం.

1895 మే 11 వ తేదీన చిత్తూరు జిల్లాలోని మదనపల్లిలో నారాయణయ్య, సంజీవమ్మ దంపతులకు ఎనిమిదవ సంతానంగా జన్మించారు. జె. కె. తహసీల్దారు ఉద్యోగంచేసి రిటైరైన నారాయణయ్యగారు కృష్ణమూర్తి గారు జన్మించిన తర్వాత మద్రాసులో స్థిరపడ్డారు. కృష్ణమూర్తిలోని ప్రతిభా పాటవాలను గమనించిన లెడ్ బీటర్ ప్రోత్సాహంతో శ్రీమతి అనీబిసెంట్ జె. కె. ను దత్తత స్వీకరించింది. జె. కె. తో పాటు అతని తమ్ముడైన నిత్యానందాన్ని కూడా ఇంగ్లండుకు విద్యాభ్యాసానికై పంపించింది. అత్యున్నతమైన ఆర్థిక స్థాయి కలిగిన కుటుంబీకులకు మాత్రమే లభించే విద్యాసౌకర్యం ఆయనకు లభించింది.

1925 లో కృష్ణమూర్తిగారి తమ్ముడైన నిత్యానంద్ మరణించడంతో అతని ఆలోచనలు, జనన మరణాలపైన, జీవితంపైన కొనసాగాయి. అతనిలో గుప్తంగా వున్న జ్ఞాన నిధులు వెలికి వచ్చాయి. అప్పటినుంచి ఆయన ఉపన్యాసాలలో స్వతంత్ర ఆలోచనా విధానం ప్రారంభమైంది.

సత్యాన్వేషణకు ఆధ్యాత్మిక సంస్థలు అడ్డుగా భావించిన కృష్ణమూర్తిగారు దివ్యజ్ఞాన సమాజంవారు 1911 లో స్థాపించిన ' ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ' అనే సంస్థను 1929 లో రద్దు చేశారు. దానికి సంబంధించిన అపారమైన ఆస్తులకు కూడా దూరమైనారు.

' ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ' ను రద్దుచేస్తూ ఆయన చెప్పిన ఈ క్రింది మాటలు ఆయన ఆలోచనకు మూల సూత్రాలుగా కనిపిస్తాయి.

" రహదారిలేని చోటుకి గమనం లాంటిది సత్యశోధన అని నే నంటాను. ఏ ఇతర మార్గం ద్వారాగాని, మతం ద్వారాగాని, సిద్ధాంత తత్త్వమార్గం ద్వారాగాని సత్యాన్ని చేరుకోవడం సాధ్యంకాదు. సత్యమనే దానికి పరిమితులు లేవు నియమాలు లేవు. విశ్వాసం అనేది వ్యక్తి నిష్ఠమైన విషయం. దీనిని సంఘపరంగా తయారుచేయడం సాధ్యంకాదు. అలా చేయకూడదు. అలా చేస్తే అది ఒక మతంగా, ఒక సిద్ధాంతంగా, ఒక తత్త్వ మార్గంగా ఘనీభవించి ఇతరులమీద రుద్దినట్లవుతుంది. ఇలా జరగడం వలన సత్యమనేది సంకుచితమై, దిగజారిపోయి తాత్కాలిక మైన అసంతృప్తుల్ని తొలగించడానికి బలహీనుల చేతుల్లో ఆటవస్తువై పోతున్నది. వ్యక్తి ప్రయత్నంచేసి సత్యాన్వేషణ ద్వారా నిజాన్ని అందుకోవాలి".

బ్రహ్మచారిగా తొంభై సంవత్సరాల నిండు జీవితాన్ని గడిపిన కృష్ణమూర్తిగారి ఉపన్యాసాల్లో అచంచల విశ్వాసం కనిపిస్తుంది. మనిషికి భౌతికంగా, మానసికంగా స్వేచ్ఛ కావాలన్న తపన కనిపిస్తుంది. ముగ్గురితోనైనా మూడు వేలమందితోనైనా ఒకే రకంగా మాట్లాడే జె. కె. పాదాభి వందనాలకు, వ్యక్తి ఆరాధనకు వ్యతిరేకి, నిరాడంబరంగా జీవించారు. ఆయనలో భావుకత్వముతోపాటు సౌందర్య

దిదృష్టి, ప్రకృతి ప్రీతి కనిపిస్తుంది. ఆయన విద్యావేత్త కూడా.

పూర్వకాలపు విద్య మనిషిని మానసిక సంఘర్షణకు గురి చేస్తుందన్నాడు. మానవత్వపు విలువలు తగ్గిపోయి శాస్త్రీయ విజ్ఞానం విజృంభిస్తున్న ఈ కాలంలో పాఠ్య పుస్తకాలలోని విషయాన్ని విద్యార్థి మెదడుకు చేరవేయడమే విద్య కాదు. విద్యార్థిని భౌతిక ప్రపంచంలో, ఆంతరిక ప్రపంచంలో, నైతిక జీవితంలో అన్ని రంగాలలో సంపూర్ణ వ్యక్తిగా తీర్చిదిద్దడమే విద్య యొక్క పరమార్థం కావాలన్నారాయన. ఏదో ఒక వృత్తి చేపట్టడానికి, సుఖించడానికి మాత్రమే కాదు విద్య. జీవితాన్ని గమనించ డానికి, అంతరార్థం కనుగొనడానికి విద్య ఉపయోగించాలి. విద్య విద్యార్థిలో పరిశీలనా దృష్టిని ప్రేరేపించేదై వుండా లన్నారు.

వందల సంవత్సరాలనుండి మనిషిలోని స్వార్థ దృష్టిని పోగొట్టడానికి అనేక మతాలు, గురువులు, నాయకులు ప్రయత్నం చేశారు. కాని అలా ప్రబోధించినవారెవరూ తమ స్వార్థాన్ని వదలుకోలేకపోయారు. అంతేకాదు. సమాజంనుండి స్వార్థాన్ని తొలగించలేకపోగా దాన్నే ప్రోత్సహించారు. ఎవరో ప్రబోధించడం ఇతరులు అనుసరించడం జరగని పని. ప్రతి ఒక్కరూ తమలో తలయెత్తే స్వార్థాన్ని నిశితంగా గమనించగలిగి వుండాలి. స్వార్థం ఎలా జనిస్తున్నదీ, ఏ ఏ రూపాలు ధరిస్తున్నదీ ఎలాంటి ఆచ్ఛాదనలకు గురవుతున్నదీ పరిశీలించుకోవాలి. అప్పుడే అది నివారింపబడుతుంది.

సత్యాన్ని చేరుకోవాలంటే ఆత్మాన్వేషణ ఒకటే మార్గం. ఆత్మాన్వేషణకు సిద్ధం కావాలంటే స్వేచ్ఛను సాధించాలి. మతము, దేవుడు, దేవాలయాలు, మసీదులు, చర్చీలు, సిద్ధాంతాలు, శాస్త్రాలు మొదలైన వ్యవస్థలన్నీ మానవ నిర్మితాలే. తాను నిర్మించిన వ్యవస్థలకు అతీతంగా ఎదగవలసిన మానవుడు వాటికే బానిస అవుతున్నాడు. బానిసకు బంధనాలనుంచి విముక్తి దొరకదు. ఇట్లా స్వేచ్ఛను సాధించిన తర్వాతనే ఆత్మాన్వేషణ వీలవుతుంది. ఈ అన్వేషణ సమాజానికి దూరంగా జరిగేది కాదు. తాను ఈ లౌకిక ప్రపంచంలో అన్ని కార్యకలాపాల్లో పాల్గొంటూనే తన ప్రతి కదలికను గమనిస్తూ వుండడం వలననే ఆత్మ ఆవిష్కారమవుతుంది. విశాల దృక్పథంతో పరిశీలిస్తే హిందూ మత సిద్ధాంతాలలో చెప్పబడే ఆత్మ సాక్షాత్కారానికి జె. కె. గారి ఆత్మావిష్కారానికి సామ్య మున్నట్లు కనిపిస్తుంది. ఏమైనా జె. కె. గారి ప్రవచనాలు భౌతిక, భావ వాదాలకు వారధిలా కనిపిస్తాయి.

కొందరు తాము అనుసరించే మతాన్నిబట్టి ఆయన మాటల్లో తమ ఆరాధ్య దైవాల పలుకులే ధ్వనిస్తున్నవని ఆయనతో చెప్పారట. మనిషి తన భౌతిక, ఆంతరిక, నైతిక జీవిత విధానాలను తీర్చిదిద్దుకోవడానికి శాంతియుత సహజీవనానికి ఆయన పలుకులు ఎంతగానో వినియోగిస్తా యని చెప్పవచ్చు.

— పెన్నా శిరాకృ

## రంజనిమాల
### మే సంచిక సమాధానములు

**నిలువు :**

1. అందని అదృష్టం, 2. అగ్రహారం, 3. మగువ మనసు, 5. మనస్విని, 6. ఏది పాపం, 8. నయన తార, 10. జీవన సంగీతం, 11. భారతి, 13. ఆశల దీపాలు, 15. పేకమేడలు, 16. తొలి మలుపు, 17. పూలవాన, 18. పారిపోయిన ఖైదీలు, 20. జీవనచక్రం, 22. మాధవి, 24. సుధ.

**అడ్డము :**

2. అతకని మనసులు, 4. ప్రతిమ, 7. నాగావళి నవ్వింది, 9. అపరంజి, 10. జీవని, 11. భావన, 12. తార, 13. ఆహుతి, 14. సంధ్య, 19. కలల కడలిలో అలల జీవితం, 20. జీవన సర్వస్వం, 21. మనసులు మారాయి, 23. తల్లి మనసు 25. ధర్మచక్రం, 26. జీవిత చిత్రాలు.

ాంక్షలతో

# లక్ష్మీ జనరల్ స్టోర్స్

బీసెంటు రోడ్.....గవర్నరుపేట
విజయవాడ-2

## ఫ్యాషన్ వస్త్రముల సప్లయిదారులు

